2

దురిత భవంబులు । దురిమియు మాయా
వరణ మెల్ల ద్రోసి నీ । చరణాబ్జ
యుగంబుల మోసి
శిరమిడి జోహారులు జేసి
అఱువది నాలుగు విద్యలు వచ్చిన
తఱగని రాజ్యములెన్నో యున్న
తెఱకావల నున్న నిన్ను జూడన్
తరమాయని యఱచెద రహహా ॥యెఱ॥

3

చిల్లర పూజలు సేయ నా
యుల్ల మొల్లదేమో దేవా రా
జిల్లె దీవు జగమీవయై
యెల్లలోకములను బ్రోవ
తల్లివగుచు తండ్రివగుచు
కంటికి ఱెప్పవోలె
నెల్లవేళ నెంతో చల్లఁగఁ బ్రోచెదు
వెల్లడవక పసిపిల్లలట్లు మమ్ము
జూచె దైనను ॥ఎఱ॥

4

జపములు తపములు నుపవాసంబులు
అపరిమితముగా సలిపి ని
ష్కపటంబుగ నిన్నెద నిలిపి
యెపుడును లక్ష్యార్థము కలిపి
విపుల భవమ్మహానీయ మహాకృతి
విపరీతోన్నతి విశ్వమయంబును

నెపమున సచరాచరములలో నీ
కృపకయి దోసిలునొగ్గుచు వేడిన ॥ఎ॥

5

ఆపద లందున నడ్డై చేయిడి
లేపువాడ వీవె నీ
రూ పిది యని తెలిసెడు తావే
తోపదు నీ వీధల లేవే
తాపత్రయముల( బడి చెడిపోయే
కాపురుషావళి నైనను గాచెడి
భూపతి వని పొగడెద రందరు
పాపహరణ పరమపురుషుని ॥ఎ॥

6

ఎందటినో కను(గొంటి, నా
ముందుదారి( గోరిస్వామి, వా
రంద రేవా వచియించి నా
రందు గాన(బడ వ దేమి
ఇందుగలవ అందులేవ
అందరు నీవకావ
సందియంబు లాత్మన్
జెందక నిన్నెదలోన(జూచి యా
నంద మొందు ఉమ్మరాలిషా వలె ॥ఎ॥

• • •

(ఏకతాళము)

మానవ జీవిత మేతీరు మారునో
గానరా దెవ్వారికి

ఆనంద మొప్పారు । అతిశయముల మీరు
ఏనాఁడొ పడిపోవును ॥మాన॥
ఆనాఁడు దుఃఖాల మేఘాలు వర్షించు
మానస మను బీళ్ళు । మునిగి నీరయిపోవు ॥మాన॥
ఏలాటి చిత్రాలు । కాలగర్భమునందు
గ్రాలి రానున్నవో - ॥మాన॥
ఫాల ఫలకమందు వ్రాలు జరిగి తీరు
ఏలాటి యత్నాలు నేలపాలై పోవు ॥మాన॥
తెలివితేటలు నున్న కలిమి పోయెడునాఁడు
గవ్వకు మారవుగా । గుడ్డి గవ్వకు మారవుగా ॥మాన॥
ఖలుఁడని యనిపించు । తులువా యని తిట్టించు
ఇలువెళ్ళఁగొట్టించు । కలవంటి దీ బ్రతుకు ॥మాన॥

• • •

ఇవిగో పూవులు స్వామి
ఇవిగో లాజలు స్వామి
ఇవిగో పూజలు స్వామి
ఇవి గైకొన వదేమి
నా సామి
నా లేమి
నే నేమి
ఈయగలను-నీకు
ఇయ్యగా గలను-
మనసునే
వేలు భక్తులు నీకు
వేలు పూజలు నీకు

వేలు మ్రొక్కులు నీకు
నీలోన నే నొక్క
నెరసూ నైన కాను

# వచ్చి వచ్చేదాక

1

వచ్చి వచ్చేదాక
వచ్చి వాయెత్తి పిలిచావు
వచ్చి వాకొట్టి లేపావు
వచ్చి వాపోయి తిరిగావు
వస్తే చూపిందేమి
వస్తే చెప్పిందేమి
ఒక మాటలో నైన
ఊసు చెప్పావ
ఒక పాటలో నైన
మరుగు విప్పావ.

2

వెలగొన్న ముత్యాలు
తలంబ్రాలు బోసితే
అలకా పురాలన్ని
అగపర్తు నన్నావు
ఊర్ధ్వలోకాలన్ని
వెలిబుత్తు నన్నావు

3

పాతేటి యేటిలో
పారాణి అగపడితె

ఆ రూప మెవరిదో
అడిగిచెప్పావ; మాకా
అడుగు చూపావ; మా
నుడులు విన్నావ.

4

గంగ పొంగే చోట
సింగారు ఆ తల్లి
నింగి మెఱసేలాగ
తొంగి చూచాను-
ఆ చూచే-
త్రోవ చెప్పావ-ఆ
క్రేవ తొక్కావ-

5

ఆ వెండి కొండపై
ఆ స్వర్గ మగపడితె
దేవతా కలశాల
తే నిచ్చినావ: ఆ
దేవతా గానాల
విన నిచ్చినావ, స్వామి!

6

ఆ పర్వతాలలో
ఆ పరంజ్యోతిలో
రూపించు నీ రూపు
చూపవచ్చావ-అది
చూడనిచ్చావ-ఆ సాంత
మది-చూడ నిచ్చావ.

7

మంచు కొండలెక్కి
నించోని చూచి పా
పంచాల పాతాళమునకు
పోయావు; మా
కథలె విడిచావు.

8

బాట పొడవున వన
స్పతులు వస్తూవుంటె
మాటలాడే విధము
మాకు చెప్పావ-మా
మనసు నిలిపావ.

9

చీకట్ల చదలేటి
వాకళ్ళ తలుపులు
నాకవాసులు తీసి
మాకేసి చూచితె
ఆ కబురు
మాకు చెప్పావ-మా
మాట తలచావ.

10

ఆ చిత్ర చిత్రాలు
ఆ చెంచు గూడాలు
ఆ చాటు మాటులు
చూడ నిచ్చావ-
అడగ నిచ్చావ.

11

రాగాల పీఠల్లొ
నాగ స్వరాలలో
మూగవాళ్ళగ పెట్టి
లాగి వేశావె-మ
మ్మాగ నిచ్చావె-నిమిష
మాగ నిచ్చావె-

12

కురుపాండు యుద్ధాల
క్రొన్నెత్తు పేరుల
చెరువులను నిర్మించి
చెప్పి గీతాలు-అది
తప్పి పోయావు-

13

కడలి కెరటాలెక్కి-
సుడులలో పడవైచి
నడిదారి హరిచేరి
అర్థించినాము నిన్ను
దర్శించినాము.

14

ఈ జీవ యాత్రలో
నే జేయు యాత్రల
పూజించు నా స్వామి
ఆలీషా పొమ్మన్నరాదా.

...

1

నిను గనుగొన నా మనము తపించె నన్
గనుగొన వపార కరుణా భరణా ॥నిను॥

2

అన్నియు నీవని అర్పణ జేసితి
నన్నెడ బాయుట న్యాయమాస్వామి ॥నిను॥

3

నీలో నే నొక నెరసును కానో
ఆలోచింపుము ఐక్యముజెంద ॥నిను॥

4

నావా రెవ్వరు నీవేకావా
ఆవలగల నాతావే నీవని ॥నిను॥

5

హృదయము వీణాకృతి కృతిపాడుచు
అదె నినుబిలుచు నుంరాలీషావలె ॥నిను॥

## తొట్టిపాట

1

శ్రీమీర వరము లిడగా
భక్తులదె ముకుళితాంజలి వేడగా
ఆ మహాస్వామి కలికి
అవతార మెత్త సంకల్పించెను ॥శ్రీ॥

2

స్వర్గీయ దివిజ కోటి
నిర్గమన విధము లేర్పడఁజెప్పెను:
భర్గ లింద్రాదు లపుడు
అర్గి రాయాదేశ రారాజులై ॥శ్రీ॥

3

కల్ప వృక్షపు పంక్తులు
కనక కామధేనుల మందలు
వేల్పు పైజ్ఞానికులుగా
రే కెత్త దిశలకై । సాయించిరీ ॥శ్రీ॥

4

అమృత వాహిని కురియగా
సమకట్టై మెరపుమెరసిన తీరుగా
తమసులిల దిగజారెను
విమల వాఃపూరముల్ విరజిమ్మెను ॥శ్రీ॥

5

గగనాల ఘంట ¡ మ్రోగె
నిగమాల నుడులుమా¡ర్మో్రయించెను
యుగయుగాంతర సంధిగాఁ
దగుననుచు ¡ ప్రజలు నాకర్ణించిరీ ॥శ్రీ॥

6

ఆకాస యానములను
అంబుధుల గర్భాల భేదించియు
రాకాశశాంకుఁ డనఁగా
లోకాన బాలుఁడై జన్మించెను ॥శ్రీ॥

7

ఈ బిడ్డ జై వాతృకుండు
ఈబుడుత లోకాలనేలు ప్రభుండు
ఈ బాల శశిబింబమా
మాపాలి పెన్నిధిగ యూపించెను. ॥శ్రీ॥

8

సూర్యచంద్రులు నేత్రముల్
ఫాలంబు రుజమ్మండలము చూడంగా
శౌర్యంబు సొంపారంగా
నవ్వువెన్నెల నవ్వి నవ్వించెను ॥శ్రీ॥

9

దృష్టిఏటికి తగులును
దుష్టసంహార కరుండుగం బుట్టెను
అష్టకాంతల తోడను
ఆవిర్భవించె హరి అవతారమై ॥శ్రీ॥

10

నాదాతి బిందాతియూ
కళాతి ప్రణవాతి ఆదిత్యలూ
అదిఫాలదరిలు
నాగకన్యలు లాలియని పాడిరి ॥శ్రీ॥

11

ఈ రేడులోకములకు
ఈరేడు సిరులు గురియును నేఱగా
అరామలెల్ల తోడై
గాతాబుపట్టి తొట్టిని బెట్టిరి ॥శ్రీ॥

12

జయహారతుల నిచ్చియు
పళ్ళాల ఫలహారములు పంచుచూ
నయగాన కళలు చెలఁగా
హైహాయలుపాడి అభివర్ణించిరీ ॥శ్రీ॥

13

పాడిపంటలు పండునింకా
పాలేరు లేరుతై ఏపారగా
తోడునీడై ధర్మము
కాపాడు మాకాతఁ డాదర్శమై ॥శ్రీ॥

14

నిత్యకళ్యాణ మింటా
పచ్చతోరణలు వ్రేలుచు నుండఁగా
సత్యదేవత లెల్లరు
ఆశీర్వదింపగా నిడెవచ్చిరి ॥శ్రీ॥

15

ముత్యాల ముగ్గుబెట్టి
రంగవల్లికల వేడుక నింపుచు
నృత్యాలుసేయు చెలులు
వినుతించు కృతులు సత్కృతులారగా ॥శ్రీ॥

16

బ్రహ్మాండ మనెడు తొట్టి
వేదాలు పగ్గాలుగా కట్టిరి
బ్రహ్మాది దేవతలును
పట్టి ఊపిరి నింగికంపింపఁగా ॥శ్రీ॥

17

పవనుండు వీవఁదొడఁగె
అగ్ని ముకుళితహస్తుఁడై యుండఁగా
సవనాలు పూలు గురిసె
వసువు లందఱువచ్చి పూజించిరీ ॥శ్రీ॥

18

మంగళంబులు మ్రోయఁగా
తూర్యముల్ కైవారములు సేయఁగా
రంగారు నీపర్వము
ఉంరాలిషాకవి వినుతించెను ॥శ్రీ॥

---

సురటరాగము ఆదితాళము

కోరివినుమ తత్త్వచరితము జేరి
నిజధర్మమిది మదిని మీరి
పారమార్థిక చ్యుతుఁడుశరీరి
మాయతోఁ బ్రపంచము జేరి
సారహీన సంస్కృతిలోన జారి
ప్రకృతిలోఁబడి వైరి
వారములకుఁ జిక్కి నరుఁడై
దారపుత్రులో యనుచు మూర్ఖుఁడై వారి
హితమరయుచు పరము కరిగెడు
దారేమి నారయక యవిద్యను ॥కోరి॥

---

• ఇది అధ్యాత్మ రామాయణములో "చేరి వినవె శౌరిచరితముగారి" అనువరుస

2

మట్టి వంటి తనువు
స్థిరమని
పట్టి ప్రేమ విడవు-దీని
గుట్టు తెలియలేవు - దేహము
వట్టిరోగముల నెలవు - ఇది
వుట్టిమెఱపు రీతి దోచిపోవును
ఇట్టిమాయమగుచు నొక్క త్రుటియే
పట్టదు నిక్కము నిజరూప మెఱుగలే
నట్టినరుం డధోగతిని బడి వి
రాట్టయిన యాత్మను వివిధగతి
గిట్ట భవసముద్రమున నిడి
మట్టయిచని తిరిగి మర్త్యుండై
పుట్టును యథాస్థితి నింద్రియముల
తట్టు జేరుతన్ను తానెవండను యోగదీక్ష
నెట్టు యార్థిక విషయవిరతి
మెట్టి స్వప్రకాశ భ్రష్టుండౌ తుద
ముట్టన్ జనండు జీవుడ హరియయి ॥కోరి॥

3

కాల వశముచేత, కర్మ
కలాప భీతచేతనుండవై,
తేలలేక, పాతకాంబుధి
గూలి పోయితివి, ప్రేతవై
తేలి తొంటి జన్మములను గని,
బేల వై విచారపడి కడచి, యీ
లీల నిజసదనము జని గురునిగని

కీలెఱింగి చూపుదెలిసి గుణ మి
ధ్యాలాలసత్వ మణఁచి శమదమ
శీలాన్వితుఁడ వగుదు, వందే
ఫాలాగ్రంబున వేణునాద
మాలాపనంబు సేయు చక్రి, య
నాలోచిత మనస్క లీలరహస్యము
ఆలోకనే సేయ రిదెతపసు
మాలికలను ద్రిప్పుకొనిన మనసు
మాలిన్య మరుగ దెప్పుడిదె తెలివు ॥కో॥

4

మంద బుద్ధిగాక
 ఇంద్రియ
బంధములను జొఱక
 మోహా
స్పందితుండు నగుచు చెడక
డిందివిషయ విహ్వలుఁడు గాక
అందరాని యమనస్కపదము మొద
లంది తృప్తి బొంది తానుతానై
యుందునందు నొక్కరీతి వెలిఁగి బ్రహ్మా
నంద పదవిగని చిత్ప్రకాశుఁడ వి
నిందాత్మకుఁడు పూర్ణుఁడగుణుఁడు
వందితుండు నిగమనుతుఁడు స
నందానేక ఋషుల పోలిక
నంది జడత బాసియుండు న
మంద దివ్యసుఖము జెందు జన్మల
నందఁబోఁడు యథేచ్ఛగాఁ దిరుగు

సందియంబు లేదు ముక్తి విధమిల
కుందకను కృతార్థుఁడై చనుము ॥కో॥

5

ఆదియందు నీవె
ఆయ
నాది యందు నీవె
యిటుపై
యాదిమధ్య లయుఁడు నీవె.
నాదమై యనంత మహిమా
పాదుఁడై తనువు గలిగిన పోయిన
బాధితుండు గాక శిథిలఘోరప్ర
మాదమౌ యవస్థలుడిగి జ్ఞానో
పాధికుఁడ వగుచు స్వప్రకాశమతి
మోనావహాము నైన తన్మయ
సాధకమున నగుపడెడు పద
చ్ఛేదం బైన ప్రతిపదార్థ మ
భేదబుద్ధి తానుగాగ వి
వాదమణఁచి యంతరాత్మ "సోహం"
పాదద్వయము జపముసేయ కృత
సాధకుండు జ్ఞానమూర్తి యెచ్చట
పాదముంచు నచ్చట స్వారాజ్యమగు ॥కో॥

6

పంచభూత మయుఁడు
ఈశ్వరుఁ
డంచు తెలియు నరుఁడు
తానటె

యంచు చెప్పగలఁడు
తనుతాఁ
గాంచి యేముఱియు నతఁడు వీ
క్షించు నీమహా యజాండభాండము
మంచుబిందువో యన పరి
కించు, సమంచితమగు చరాచరము లెద న
ర్థించి, మేఘములలోన మెఱసి వ
ర్షించి, నదీసలిలమై పర
తెంచి, కుసుమ సౌరభముల
బొంచి, ఉండు కోటిలోపల న
టుంచి, రవియై రవికంటెను
మించి, యొక్కఅణువై భువి కవత
రించి, కోకిలంబునయి వనముల ధ్వ
నించ, పాటపాడి తానె సకల మ
టంచు, నెంచు విశ్వరూపముగ ॥కో॥

7

ఈ రహస్య మిందు
దెలిసిన
వారె యోగు లందు
ముఖ్యులు
ధీరు లిందు నందు
తెలుపఁగ
గోరుచుందు రందందు
ఈ
దారి నెనసి నితరులు తరింపఁగను సొం
పారఁ దలఁచి దివ్యేదివ్యేను ముట్టి

## తత్వసందేశము

దారుణమైన తమ సుప్రకాశమైన
తీరున పవిత్రుఁడు హరి ప్రణవా
కారుడైన ఆ శైలలీగురుం
డీ రాదాంత మంత ఉమ ర
లీషాకవి కొసంగె భక్తి
కారంభ విదూరులకును సం
సారాగ్ని నిమగ్నులకుఁ దెలియ
నేర దిది, యమేయ దివ్య
స్ఫారంబైన సువి
చార మతీంద్రియోరుసం
స్కార చారువేదాంత తత్వార్థ వి
ద్యారాజ పదము బొందు మట ॥కోరి॥



అ ను బ ం ధ ము



# ప్ర బో ధ ము

పైన ఆకాశంబును క్రింద నేలయుగల యీ పంచభూతాత్మక మహా ప్రపంచమునందు చీఁకటిచే కప్పఁబడి మాయా మయాత్మకమైన మహా తమోవారాశిని శరవేగముగా కొట్టుకొనిపోవు కాలవాహినికి గురియై ఏదో అనంతా గాధమైన నిమ్న సోపానములకు దిగిపోవుచున్న యీ భయంకరమగు జీవిత సర్వస్వమునందు మానవుడు జడుడై సంక్షుభిత మనస్కుఁడై తెల్పుకొనలేని ప్రకృతి బంధములకుఁ జిక్కి తుదకు గడ్డిపరకకైన కొరకాక కామాదుల కాళ్ళియమై అహంకార మమకారము లకు నిలయమై విషయాల కాణాచియై పూరింపరాని తృష్ణచే తలఁబడి వగగూలి కరగి నీరై పోవుచున్నాఁడు. మట్టై యెగిరిపోవుచున్నాఁడు. అయ్యో! ఇదియేనా మానవుని పర్యవసానము? కాదు. అస్థిమాంసవసా వికారమైన మానవుడు మృత్తికారేణు సముదాయమున ప్రోగుపడిన సచేతన సనాతనాధిక దివ్యవ్యక్తి శబ్ద స్పర్శ రూప రసగంధాత్మకంబగు పంచీకరణముల మధ్య మహాతేజో విరాజితములై విలసిల్లు మేఘాలలోని మెఱపులవలె ప్రదీప్తి గాంచుచున్నను, ఆవరణ విక్షేపాత్మకమైన జడప్రకృతి కాస్పదమగు అవిద్యచే ప్రచ్ఛన్నమై, ప్రభిన్న స్వరూప నిష్పత్తిగాంచి కించిదజ్ఞత్వాది గుణవిశిష్టమై వాసనావేశితమై. నానావిధ కర్మకలాకలాప మలీమసత్వమును జెందుచున్నది.

ఇది మాటలచే, యుక్తులచే, మదములచే, వేషభూషలచే వదలునదిగాదు. అచంచల మగు మహాతపోదీక్షాదక్షమైన జ్ఞానశక్తి సాధనసంపత్తి అధ్యాత్మికయోగ విద్యావిమానారూఢమగు తేజస్సు

నిర్వికల్పమగు నిష్ఠా నిమీలిత లోచనాంతర్గత సుషుమ్న మార్గ మహత్తర జాజ్వల్యమాన మానిత ప్రభాపటలము ఏకాగ్రత, పవిత్రతర శౌచశీలాచారా వికార సుస్థిర సముపాసనోపాసిత సూనృతవ్రతమందలి లక్ష్యము లత్యంతావశ్యకములు. ఇవి లేక మెట్టవేదాంతములు రౌరవాది నరకానలములకు దారి తీసి మాడ్చి, బూడిద గావించును. అధోగతి ముట్టించును. ప్రజలయెదుట మాయగాని పరాత్పరుని యెదుట కాదు. కూటికై కోటివిద్యలున్నను, బ్రహ్మవిద్య పవిత్ర ప్రవర్తనముపై పునాదులుపెట్టి ఉన్నది. ఆ నిగూఢ సత్యము తెలిసి, తెలివి తెచ్చుకొని జితేంద్రియుడవై, అవాఙ్మానసగోచరమైన ఈశ్వర సాక్షాత్కారముకైన అట్టులు చాపుము. నేలఁబడినను, తిరిగి యత్నించి ప్రాకి, పడరాని కష్టములపడి పడయఁగోరుము. అప్పుడే నీ కర్మబంధము తెగును. నీ జీవరహస్యము తెలియవచ్చును. నీ మరుగు గోచరమగును. నీవు తెర కావలనున్నావు. నీ మాయ తెర ఎత్తినఁగాని, నీలోని నిజము నీకు తెలియదు. తెలియని అంశములను తెలిసినవానివలె తెంపరివై తెగ వాగుచున్నావు. పెద్ద ఆర్భాటములు చేయుచున్నావు. ముక్త కంఠముతో దశదిశాంతములు మ్రోమ్రోయునట్లు గర్జించుచున్నావు. అయ్యో! నీ రక్తనాళములు బద్దలై పోయినవి. నీ జీవనపుటోలములు వసివాడిపోయినవి. నీ ప్రాణములు సొమ్మసిల్లినవి. నీవు లోలోపల కుమిలిపోవుచున్నావు. మొత్తుకొనుచున్నావు. నీకు పశ్చాత్తాపము రాలేదు, భీతి జనించలేదు. కాని నీవొక వీరునివలె రక్తసిక్తావలేపనమైన బ్రతుకులో పడి, వెర్రివెర్రి వేదాంతము వట్టికుండవలె పాడుచున్నావు; ఆడుచున్నావు. నీ అవజ్ఞత నీవు గ్రహింపలేకపోవుచున్నావు. నీకు నీ నిజము తెలియదు. నీవు అజ్ఞానాంధకారమున నీ ఆత్మను నశింపఁజేసికొన్నావు. నీవిఁక లేవు, లేవు. ఓ పామరుఁడా లెమ్ము-మేలుకొనుము. నీవు నీకైనచోటు వెదకుము. నీ వమృతత్వమును పొందుమార్గ మూహింపుము. రేపు మహాగాథ జనకమైన

మృతి నీ ముంగర లంగరు వేసి నిన్నాచికొని వాయువేగమున గొనిపోవ సమకట్టియున్నది. ఆ రంగము గడుచు నుపాయ మాలోచింపుము. నీవు అసలు శూన్యము-నీ శూన్యములో నీవు స్వదూపాపత్తిని సంపాదింపుము అదే అమృతము. అదే మోక్షము. అదే నీవు-అదే దారి. అదే మా ప్రబోధము. అదే గమ్యస్థానము. అదే సార్వజనీనమైన నిర్వాణము-అదే శాంతి. ఓమ్ శాంతి-శ్శాంతి-శ్శాంతిః.

## ధ్యానము

ఈ భూమి ఆ సూర్యుఁడు నక్షత్రాది మహాపదార్థములన్నియు తపస్సు చేయుచున్నవి. అవి మీరు విన్న వినఁబడును. ఈ సంగతి వేదము ఖురాను కూడ చెప్పినది. గొప్పగొప్ప మానసిక శక్తులపేక్షించు వారు నెత్తి నేల మోపి తపస్సు చేయుదురు. అనఁగా భూమిలోని విద్యుచ్ఛక్తి తనలో నొప్పి అనఁగా అనాహత చక్ర మాకర్షించునని భావము.

## ధర్మము

సూర్యుఁడు చంద్రుఁడు భూమి నక్షత్రములు సముద్రము మున్నగు చరాచరములు మన యుపదేశ మంత్రమునే జపించుచున్నారు. వారును మీవలెనే తరించుటకు తపస్సు చేయుచున్నారు. ఆ తపస్సు మీ తపస్సులో వినఁగలరు.

ఉపదేశ మంత్రముయొక్క అర్థము "జ్యోతిస్వరూపమైన నీశ్వరు నెట్టయెదుట నాత్మాకృతి సాక్షాత్కరించుట కాహూయమానము" అంతర్లీన మైన సంకల్పమని యెఱుఁగవలయును.

## దీక్ష

ఈ దీక్షకే సాధనమని పేరు ఈ సాధన వాచామగోచరమైన యీశ్వరుఁడు వాని సృష్టియొక్క రహస్యమను నిముపపెట్టెకుఁ దాళము

వంటిది అట్టి తాళముతో విప్పక గొడ్డళ్ళతోఁ గొట్టినట్లు కబుర్లు ధ్వనులకేగాని క్రియల కక్కరకు రావు.

ఇట్టి యీ సాధనలో సంపూర్ణస్థాన మలంకరించినవారు శ్రీ మహమ్మద్ రసూల్‌ప్రవక్త. పూర్వము శ్రీకృష్ణులు మహమ్మద్ వారు "మేరాజ్" అనుపేరను శ్రీకృష్ణులు విభూతియోగమను (భగవద్గీతలో పదియవ అధ్యాయము) పేరను తమతమ సాధనలను విశదీకరించిరి. ఇవే సాధనతత్వములోని పరమ నిగూఢములగు సూచనములు కాని సూత్రభాష్యమువంటి మహాతత్వగ్రంధము రచించిన శంకరస్వామి కూడ విభూతియోగమన నేమో గ్రహించలేకపోయెను. కాని రామతీర్థుని నిర్యాణము అనఁగా నాతఁడు దేవుఁడని భూమిని వాయువును అగ్నిని ఆకాశమును అహస్సును ఉషస్సులు కౌగిలించుకొనఁబోవుచుండెడివాఁడు తుదకు ఆపస్సులపై ప్రేమ పట్టలేక కౌగలించుకొనబోయి గంగలోఁబడి చనిపోయెను. దీనినిఁబట్టి యాతఁడొకింత యెఱుంగునేమో యని తోఁచెడిని, గీతలోని అసలున్న మర్మమే విభూతియోగము. తక్కినవి వట్టితుక్కు ఏమందురా శ్రీకృష్ణుఁడదే సాధన చేసిచేసి అనగా ప్రపంచములోని ఘనాఘన పదార్థములు నేనేయని సాధన చేసిచేసి మహాఘనుఁడై అర్జునునకుఁ విశ్వరూప సందర్శనమను పేర త్రిలోకములు జూపగలిగెను. ఇది గీతలో 11 వ యధ్యాయము విభూతి 10 వ యధ్యాయము అనఁగ ఒకటి సాధన (Practice) రెండవది (Display) ప్రదర్శనము కావున విభూతియోగము శ్రీకృష్ణుని మహాత్మ్యవిశేషములే కావు. సాధన విశేషములు. అదేదారి యిది యెవరును ఎఱుంగఁజాలకున్నారు. కాని మహమ్మదువారి "మేరాజ్" గ్రహించినవారు కొందఱున్నారు. కావుననే మహమ్మదీయ తాపసులు అత్యద్భుత మహాశక్తులు తృణప్రాయముగా సాధించి చూపఁగల్గుచున్నారు.

# మేరాజ్

క్రీస్తుశకము 622వ సంవత్సర ప్రాంతమున నొకనాటి రాత్రి మహమ్మద్ వారు ఆకాశ సోపానమెక్కి వెళ్ళి యీశ్వరుని చూచి మాటలాడివచ్చి నేనీశ్వరుఁడనై యీశ్వరునిఁ జూచినాను. "అల్‌రాయ తె-రబ్బి బెరబ్బీ" అని చెప్పిరి. ఆ ప్రయాణములోని విశేషములు విభూతియోగములోని భావములనే యనుకరించుచున్నవి. అనఁగా నివే పరమార్థ ద్యోతకమైన మోక్షసామ్రాజ్య సిద్ధికిఁ బ్రధాన రంగము.

ఇది తెలియనివారు మహమ్మదువారిది ఆకాశయానము శ్రీకృష్ణుని విభూతియాకాశ పంచాంగమనుచున్నారు. కొందఱివి ఆధ్యాత్మికములను చున్నారు. అట్లనుట సరికాదు. ఇది కేవలము చరిత్రాత్మకమైన ముఖ్యోదంతములు వాస్తవములు భావమాత్రములుగావు.

మఱియు నీ "సభ" అనాదిసిద్ధమైనది. సూర్య చంద్రులతోఁ బుట్టినది తిరిగి సూర్యచంద్రులతో ముగియఁగలదు.

దీనికి మూలపురుషుఁడీశ్వరుఁడు అవతారులందఱు ప్రచారకులు. ఋషులు జిజ్ఞాసువులు. ఒక శాఖ శ్రీకృష్ణాది దశావతారములలోను ఒక శాఖ మోసే మహమ్మదువారిలోను వచ్చినది. మొదటిశాఖ కల్క్యవతారి తోను రెండవ శాఖ "మహదీ" తోను వికాశమునకు రానున్నదని శ్రీశ్రీ ఆఖైలలీషా గురుస్వాములవారు ఏతచ్ఛిద్ధాంతములు కల్కి భాగవతము, ఇల్మసైర్ అను రెండు దివ్యగ్రంధములు వ్రాసి యందు ఈ సభాప్రాతిపదికాది ముముక్షధర్మములు సవిస్తరముఁగ వ్రాసియున్నారు.

# ప్రార్థన

౧

సకలాంతర్యామివై సకల భూతములందు లయమై సకలవస్తు స్వరూప సాక్షాత్కారముచేత నీ నిజరూపము లోకమునకు వెల్లడించు నీ వినిర్మల దివ్య తేజోవిరాజిత మహామహనీయ మార్తాండ మండలము మా వైపు మరలించి మా చిరకూర్చిత పూర్వకర్మ మలీమసములను చీకటిని బరిమార్చి స్వచ్ఛమును కళంకరహితంబును మిక్కిలి పవిత్రీ భూతమును నైన నీ విజ్ఞానము నీ నిజారాధనము నీ ప్రపత్తి మాకు ప్రత్యూషము ప్రసాదించుము స్వామి. మేము పామరులము, దీనులము, తెలివిలేనివారము – నీ అపార పారావార సదృశమైన దయావృష్టి మాపై కురిపి మమ్ము నీ వైపు మరలించి మా దృక్కులను కేంద్రీకరించి మాకెప్పటికిని కరిగిపోవని నీ భాగ్యమును లక్ష్యమును, నీ నిష్ఠను, నీ ధ్యానమును, ఏకాగ్రతను ప్రసాదించుము తండ్రీ మమ్మన్ని విధాల కాపాడుము రక్షించుము నిన్నే మేము శరణ్యము వేడుచున్నాము; నిన్నే మేము గతియని భావించుచున్నాము; స్వామి, ఈశ్వరా, తండ్రీ! కరుణించుము, నీకు నమస్సులు.



౨

ఓ స్వామీ! నీవు అనంతుడవు. అప్రతిహతుడవు. అతీంద్రియుడవు. ఆకాశాది పంచమహాభూతంబులను, సూర్యచంద్రాది నక్షత్ర మండలములను, దిగ్దిగంత బ్రహ్మాండభాండంబులను, సచరాచర భూత కోటిని, సృష్టించి మహాపదార్థములలో నిండి నిబిడీకృతమై, యన్నిటికి సాక్షివై నీవే ప్రకాశించుచున్నావు.

స్వామీ ! నీవు ఈశ్వరుడవు. సచ్చిదానంద స్వరూపుడవు. సగుణ నిర్గుణాత్మక పరబ్రహ్మ చైతన్య మహా తేజోవిరాజితుడవు. నిన్నే

రుంగుట కెవరికి సాధ్యంబుగాదు. ఎవరికి గోచరంబుగాదు. స్వామీ! నీయందీ యనంతాకాశంబును, ఈ చతుర్ధశభువన బ్రహ్మాండ భూత కోటియు, రేయింబవళ్ళతో గూడిన కాలవాహినీ శతంబులును, దేవ దానవాది మర్త్యకోటియు, దివియును, అమృతంబును, ఆదిత్యుండును, ఆదిమధ్యాంతర లయంబగు శూన్యంబును, స్వరూపాత్మకమైన తేజస్సును, సాంధ్యాదిపరిభాత భాసుర పరమ, మహామహిమా పదార్థంబులును, యోగవిజ్ఞానాది యజ్ఞపురుష స్వరూపంబులును, అగ్నియు, ఆపస్సును. వాయువాది సూక్ష్మాతిసూక్ష్మత్రసరేణు సముదాయంబును సర్వంబును, అణగి మణగి నిగూఢమైన నీయందు రూఢమగుచున్నవి తండ్రీ! జగజ్జ్యోతి స్వరూపుడవైన నీవే, సమస్త భూతజాలముల యందు కేవల మంతర్లీనమై, అభూత భావిభావద్యోతకమై, అమలమై కలుషాపహమై సావరజంగ మాత్మకమై, మాయందు ప్రవేశించుము తండ్రీ! మాకు నీ నిజరూపము, నీ యథార్థమైన వెలుగు, నీ యగాధమైన సత్యము, నీ పరతత్వము, నీ యసంగతమైన, దేదీప్యమాన మానితమైన తేజస్సు, సాక్షాత్కరింపుము స్వామీ! సదసత్పదార్థముల కవ్వలై, మాయ కతీతమై బ్రహ్మాండాది భువన విరాజమానమైన నీ తేజస్సు, నీ నిష్కళంకమైన, నిరీహమైన, నిష్ప్రతియోగికమైన, నీవిన్నాణము, నీ సోయగము, నెలయందు వెన్నెలయై, దిక్కులందు రూఢమై పాతాళంబుల దూరి–నభములపై కెగసి, అంతరాళముల భేదించి–పంచ భూతాత్మకమైన ప్రకృతిని దాటి చీకటిని గడచి–వెలుగులో వెలుగై–నభముపై నభమై–శూన్యములో గలిసి శూన్యమై శాంతిస్వరూపమున విరాజిల్లు నీవు నీ మహిమాస్పద సర్వశక్త్యాత్మక పవిత్ర తేజస్సు–ఆ వినిర్మల వికాస విశ్వరూపము–ఆ నిరీహ నిష్కళంక–నిరవద్య–నిష్ప్రతి యోగిక–నిరాలంబ నిత్య సత్యప్రత్యగభిన్న పరమాత్వ తత్వము–నీ అసదృశ ఆవాచ్య–అసామాన్య అనూనాధిక మహా గంభీరాకారము–

నీ పవిత్ర ప్రపుణ్య దివ్యగాత్రము - నీకళ్యాణ గుణగణ పరిభాభాసితము మా కెరింగింపుము తండ్రీ!

మృద్దారు శిలాపరివేష్టిత నామరూపాత్మక విశ్వ విశ్వంభరాచ్ఛిన్న అభిన్న ప్రతిపాదక ప్రకృతి కవ్వలనున్న నేకాకృతివగు నీవు · సుజల జలనిధి వ్యామోహిత, తరంగమాలికాంతర్లీన ప్రణవైక సుధాగాన సముపాసనోపాసిత తుషారపరంపరలయందు నీవు; నిరలంకృత విభీత సంక్షుభిత నితాంత మహోపద్రవ పాతాళ నిమగ్నసోపాన పంక్తిలో నీవు; ధగద్ధగిత జాజ్వల్యమాన మహాభీభత్స భగ్నాగ్ని మండల మధ్యావకాశ ప్రభాపటల ప్రదేశ విహార విలాస లాలస విలసదసమాన ప్రళయ ఝంఝూమారుతముల యందు నీవు; నిమీలిత ప్రసవ సువాసనావాసిత గంధవహ కదంబములపై నెక్కి తెక్క లల్లార్చి నేర్చిన గీతికా ప్రకాండము లాకాశావృత నిశాకన్యకా నీల నీరద సన్నిభ చేలాంచలముల జారు దగ్గ తమస్సముదాయము పటాపంచలు గావించు నుషాదేవి కర్ఘ్యమిచ్చు పక్షుల వాక్కులయందు నీవు; ఈశసూత్ర విరాట్‌వేషాది యక్షరాక్షస మరుదింద్రదాగ్నివిష్ణు, భైరవ మైరాళమాది మహాఘోర ఘనదేవతలయందు నీవు; స్నిగ్ధ ధూళిధూసర సంమిళిత దిగంతవిశ్రాంత ధూమకేతు నిపాత ప్రచలిత ప్రమాణ పరికర పరంపరలయందు నీవు; నీవులేని నిలయము-నీవులేని స్థితి-నీవు లేని రక్షణలేదు.

నీ తలపై చుక్కలు తలంబ్రాలు జల్లుచున్నట్లున్నవి. మంద మలయమారుతములు వీవనలు విసరుచున్నట్లున్నవి. రేయింబవళ్ళు, సూర్యచంద్రులు హారతి పళ్లెములై నీరాజనము లిచ్చుచున్నట్లున్నవి. మేఘగరారావములను మృదంగములు కాలనాధుడు మీటుచుండ ప్రకృతి కన్యదిక్కుంభికుంభములపై నెక్కి గజ్జెలందెలు ఘళ్ళు, ఘళ్ళుమని మ్రోయ నాట్యపాటవము జూపుచు నీ నామము శ్రవణ శ్రావ్యముగ

నెలుగెత్తి ముక్తకంఠమున నుడువుచు మోళ్ళను చిగురింపజేయు చున్నది, ఆహా! మేము నీ సహజ సౌందర్యములోని యొక నెరసైన, నొక్క అణువైన, ఒక్కలేశమైన నెఱుగముగదా! చూడలేముగదా! వినలేము గదా! స్వామీ! నీ నెలవు, నీ నిజరూపము, నీ వినిర్మల విశాల విద్యా ప్రపంచ సౌభాగ్యము, నీ కాంతి, నీ ప్రతిభా ప్రపుణ్య లావణ్య మహావా రాశి, నీ ధామము, నీ నియుక్త నికేతనము, నీ ఋజుమార్గము మా కగుపర్చుము స్వామీ! నీవు మా అజ్ఞానాంధకార విరచిత కలుషజాలము లకు కర్మసాక్షివై, నానావిధ కోప తాప తమో మలీమస మహా సము ద్రము దాటించు నావవై, కర్ణధారుడవై ఎడతెగని తాపత్రయ దురంత దుఃఖ ముఖ దురుద్యోగ నికాయములను రూపుమాపు సిద్ధాంజనమువై, బాసటవై, బంధువై, అప్తుడవై, అన్నివిధాల తోడ్పడుము తండ్రీ!

మేము సంసార మహా గాఢాంధకార మాయార్ణవంబున మునిగి, విగళితమై, పతితమై, గమ్యమాన మనస్సంధానులమై, నిరవకాశ నితాంత తమస్సంస్మృతిని బడి, దారి గానలేక నీ కరుణకై నీ కటాక్ష వీక్షణములకై వేచి, నీకై దోసిలొగ్గి నీ యాశీస్సును గోరి పడియున్న, నిరీక్షించుచున్న మమ్ము. మా సంతతిని కాపాడుము, తండ్రీ! నీవు కరుణాళువు, దయాళువు, దీనరక్షకుడవు, దేవాదిదేవుడవు స్వామీ! నీవే మాకు దిక్కు నీవే మా శరణ్యము, నీవే మాకు జీవిత సర్వస్వము. నీకు మా నమస్సు లగును గాక! రక్షింపు తండ్రీ!



# ఈశ్వరుఁడు

తే. గీ. అవని సృజియించినట్టి వి । శ్వాత్మకుండు
మానవులకన్ని యెడల తో । డ్పడెడువాఁడు
ఊహలకు నందనట్టి మ । హోన్నతుండు
ఈశ్వరుఁడు మాకు నెప్పుడు । హితము గూర్చు.

తే. గీ. పంచభూతంబు లెవ్వాని । వాసగృహము
పరగ నక్షత్రలోక మె । వ్వాని పథము
భానుచంద్రు లెవ్వనియాజ్ఞ । బాయకుంద్రు
అతని నీశ్వరు సేవింతు । ననవరతము.

తే. గీ. రాత్రియందున నెలవెల్గు । గా్ౕరిలజేసి
పగటి యందున భానుని । పంపి యెల్ల
జంతు జాలంబులను గాచు । సర్వమయుఁడు
నీశ్వరుఁడు మాకు దోడ్పడు । విశ్వమందు.

తే. గీ. ఆకు పచ్చని కొమ్మకు । నందమైన
నెఱ్ఱని సుమంబు కల్పించు । నెమ్మెకాఁడు
శుక్తిగర్భాన ముత్యాలు । జొనుపు నట్టి
ఈశ్వరుండిచ్చు మాకు న । భీష్టసిద్ధి.

నమస్తే! నమస్తే! నమః



# కృతి

శా. శ్రీయాఖైలలీషా గురూత్తముని సం
సేవించు విద్యాపరిఖా
ప్రాయంబైన వెలుంగు నింగిత ముషః
ప్రాభాత సంధ్యాతమో
ధ్యాయం బైన నిశాకవాటముల హృ
ద్ధ్వాంతంబుతోఁబాటు పోఁ
ద్రోయం జాలు తదీయ తేజ మొదనెం
తో వేట్క నర్ధించెదన్.





ఈ సాధనపథము పరమపవిత్రమగు యోగగ్రంథము. ఇందనేక ధర్మరహస్యములు క్రోడీకరింపఁబడి గొప్ప విశ్వప్రపంచమువలె వెలయుచున్నది.

సంసారసాగర నిమగ్నమానమానసులై దరిగానలేని వారలకిది యొక దివ్యనౌక. దీనివలనఁ గృతార్థులు కానివారుండరు.

సహజముగా జ్ఞానవిద్య అప్రబోధముగను, ఊహాజన్యముగను అగమ్యగోచరముగను నుండును. కాని అది మానవ జీవితమునకుఁ బ్రధానమైన నమృత సరస్సున కెక్కిపోవు దివ్యసోపానపంక్తిగా నెఱుంగక తప్పదు.

ఝంఝామారుతము లరణ్యమహామహీరుహముల నెల్ల నొక్క త్రుటిలో వేళ్ళనుండి పెకలింపఁగలిగినను మహీధరముల నొంప నెట్లు సాధ్యముకాదో అట్లే ప్రకృతిందగిలిన వారి హేతువాద విషవాతావరణము భక్తుల హృదయములు భేదింపఁజాలదు, అదేతత్వము. అట్టి పరిపూర్ణ నిర్గుణాద్వితీయ మహామహితమైన తేజః ప్రపంచమునకుఁ దీసుకొనిపోవుదారినిఁ బ్రతివ్యక్తికగుపర్చునదే యీ సాధనపథము.

ఇది మిగుల చిన్నదై తోఁచినను ప్రతిసంగతి చక్కఁగాఁ జదివి మనస్సునకుఁ బట్టించినచో వేలకొలఁది గ్రంథములు చదివినట్లగును.

ఇందు మంత్రములున్నవిగావున దీనిని శుచిగానున్నప్పుడే ముట్ట వలయును. మన దీక్షలోని "సభ" వారికిఁ దప్ప నితరుల కిది యియ్య రాదు. ఇందలి మంత్రములు గురుముఖతః విని యుపాసింపవలయును.

అవి మానసిక సుస్థిరవిశ్వాసము అచంచలమగు లక్ష్యాదికమువలన సిద్ధిని బొందును. ఇవి మానసికములగు మహామంత్రములు. కావున పిచ్చుకపై చంద్రాయుధమువలె స్వల్పములపై ప్రయోగింపఁదగదు. ప్రయోగించు నగత్యము వచ్చునప్పుడు వానిని నాహూయమానము సేయవలయును లేనియెడల ఫలమియ్యదు. ఉపాసనప్రారంభమున కర్మవలె జిజ్ఞాసువులకు కావలసియేయుండును.

ది. 10-2-1928 సం॥ మాతండ్రిగారగు శ్రీశ్రీ మొహియద్దీన్ బాద్షాగురువర్యులు నిర్వాణ మలంకరించిన యనంతరమా ప్రబోధపీఠమునకు నే నాహూయమానుఁడనై శిష్యకోటి నప్పుడప్పుడు సేయు ప్రసంగములాలకించి యివి గ్రంథస్థము సేయుఁడని వారుకోర నొక వారము దినాలలో వ్రాసి ది. 12 జూన్ 1929 సం॥ తేదిని ముగించితిని.

ఇట్లు

**ఉమర్ ఆలీషా కవి**



# సాధన పథము



## మొదటి ప్రకరణము

### —* సాధన *—

సాధన వేదాంత తత్వప్రతిపాదకంబగు బ్రహ్మజ్ఞాన సంపాదనార్థ మనుసరించు నాత్మ జిజ్ఞాసయని యెఱుంగవలయును. వేదాంత మనఁగా జీవేశ్వరానోన్యన్య స్వరూప నిష్పత్తినిఁ గావించు యౌగిక విద్య. ఇది యుపనిషత్తులవల్లను "సూఫి" గ్రంథాలవల్లను విశేషముగాఁ దెలియు నందురు కాని యీ విద్య అఱువదినాలుగు విద్యలవలె శాస్త్రముల వలనఁ దెలియవలసిన దాని కన్న ననుభవమువలననే చాలవఱకుఁ దెలియుచున్నది.

ఇది యొక కాలమునకుగాని ఖండమునకుగాని జాతికిఁగాని చెందినది గాక సూర్యుని వెలుతురువలెను, మేఘమాలలోని జలకణములవలెను. వెన్నెలలోని తరళ తర ప్రశాంత సుధాసేచనమువలెను, నెల్లర నొక్క తీరున నొక్క తెఱవునఁ జరితార్థము సేయవలసినదే కాని యెవరికిని కాణాచికాదు. ఎవరికిని యుంకువయై వారితో సమసిపోవలసినదికాదు. ఇది యిహపరతారకమైనది. ఇందు రహస్యము గాని దురవగాహమగు విష యముగాని లేదు. శ్రవణమాత్రమున ఆలోకనమాత్రమున నెల్లరకుతెలియ వలసినదే. నెల్లరు తరించవలసినదే. దీనికై వేరుగ నెట్టియగచాటులును పడనక్కఱలేదు. ఇది మిక్కిలి సులభము, సుకరము. గతాను గతికముగా బ్రహ్మవిద్య దుర్లభమని లోకప్రతీతి యుండుటచేఁ గాబోలును ప్రజలు విశేషముగఁ బ్రయత్నించకున్నారు. కాని యిది చాల పొరపాటు. భగవద్విషయైక సాధనసంపత్తి ప్రతిదియు క్షణకాలమున సాధ్యమై గొప్ప పరివర్తనమున కాస్పద మగుచున్నది. అంతయేకాని యేవో యపురూపాధి కారము లనఁగా సాధనచతుష్టయాధికము లుండవలయునను ప్రసంగము లేదు. పంచదార తియ్యగా నున్నదనుటకుఁ దనకు గల నాలుక చాలును. క్రొత్తనాలుక అనగత్యము. వీణాది గ్రామఫోను గానములు వినుటకుఁ

దనకుంగల చెవులు చాలును. క్రొత్తచెవు లనగత్యము. ఇట్లే ప్రకృతిలోని సౌందర్యము, ముళ్ళలోని గులాబిపువ్వు, రాళ్ళలోని రత్నములు, చూచుట కీ కన్నులే చాలును. క్రొత్త కన్ను లనగత్యము. కావున నీశ్వరు (ఆత్మను) పొందుటకు జిజ్ఞాసయే చాలును.

శ్రుతి "ఏనాశ్రుతం శ్రుతం.
భవత్యమతం మతం.
విజ్ఞాతం విజ్ఞాతం"

అని పై యర్థమునే చెప్పుచున్నది.

ఈశ్వరత్వమును బడయని వ్యక్తియొక్క జన్మము మిగుల దూష్యము బోధకునియందు కేవలము బాధ్యత మోసియున్నది. గురువు శిష్యునకు నిజమైన ఈశ్వర (ఆత్మ) సాక్షాత్కారము గావింపవలయును. నీ కర్తృత లేకపోవుటచేత నీవు చూడంజాలవని చెప్పుట సమంజసముగాదు.

ఓ గురూ! నీకు శక్తియున్న నీ శిష్యున కీశ్వరు (ఆత్మ) ని జూపించుము. చూచువాని శక్తి కొలంది తరించును.

సముద్రము చూపించుము. పాత్రకొలంది ముంచుకొనును, నీవు ఎండమావులను చూపి ముంచుకోలేకపోయినావని తెగనాడుట చాలదోషము.

మేఘము వర్షించును. భూమియొక్క సారమునుబట్టి సస్యములు ఫలించును. నీరు కురియనిదే భూమి మంచిది కాదనుట సముచితముకాదు. అట్లే నీవు ఆత్మస్వరూపము జిజ్ఞాసువులకు విస్పష్టముగాఁ జెప్పుము చెప్పక తెలియలేరని తప్పుడు మాటలాడకుము. చెప్పినను తెలియకున్న వారి లోటుగాని నీ తప్పేమియు లేదు. నీ విధిని నీవు నిర్వర్తించుకొనుము.

భ్రమరము కీటకమును దెచ్చి తనవలెఁ జేయును. అక్కడ భ్రమరముయొక్క శక్తియేగాని కీటకము నావలె కాలేకపోయినదని కీటకముపై నెపము మోపదు.

అట్లే శిష్యుని గురువు హరిస్వరూపము సేయవలయును గాని కాలేదని సాకులు బలుకరాదు. హేమవిద్యను నేర్చినవాఁడే యినుమును బంగారము సేయును గాని మాటలను నేర్చినవాఁ డేసేయలేఁడు. బ్రహ్మజ్ఞానమునకు మాటలుడుగుటయే లెస్స శ్రుతులలో "అవచనేన ప్రోవాచ" అని ఖురానులో "సుమ్మున్ బుక్కమున్" అని వినఁబడుచున్నది.

ఒక్కమాటలో ఒక్క చూపులో ఒక్క క్షణములో మానవుఁడు ఈశ్వరత్వమును పొందును. బోధకునియందు శక్తియున్న శిష్యున కన్నియు కరతలామలకములే భోధకుఁడే భ్రాంతుఁడై యున్న నికశిష్యున కధోగతియే కావున తెలియని యర్థము బోధసేయుటకంటె మహాపాతక మింకొకటి యుండదు.

మఱియును భక్తుఁడును ఏ బోధకునియందు భక్తి కుదురునో యాతని మార్గమును శిరసావహించి నడువవలయునేకాని, క్రొత్త క్రొత్త మహత్తులు చూపలేదేమని యడుగరాదు. మహత్తులకు బూర్వము గౌరవ ముండెడిది, ఇప్పుడు పాశ్చాత్యులు పైసాకు పెక్కు మహాత్మ్యము లంగడిని విక్రయించుచున్నారు. చూడుఁడు గ్రామఫోనను కట్టిపెట్టె. రేడియోయను తంతిచే వెలలేని దివ్యగానములు దశదిశలనుండి కేంద్రీకరించి పాడించి ప్రపంచమును చక్కెరచే నింపివేయుచున్నారు. పెద్ద పెద్ద దుర్గము లరఖీలలో కరిగి వాయువుగా మార్చి కావలసినచోట అణువులుగా వర్షింపఁజేసి తిరిగి ఆసౌధమందు నిర్మించునట్లు చేయుచున్న యీ దినాలలో నేలవిడిచి మూరెడు పైకి లేచుట గదిలోపెట్టి తాళమువేసిన సూక్ష్మరూపమునఁ పైకివచ్చుట మున్నగునవి హనుమంతుని యెదుట కుప్పిగంతులవలె రసాభాసముగా నుండును.

పురములు విడిచి యడవులఁబట్టి పర్ణాంబువుల భక్షించి శుష్కోపవాసములఁజేసి నేలకు నెత్తిరాసి నేర్చుకొను దూరదృష్టి దూరశ్రవణము, నేఁడు కడుపునిండ మాంసాది క్రొవ్వు పదార్థములు మెక్కి సిగరెట్లు

కాల్చుచు మెస్మరిజము చేయు ఇంగిలీషు ఫరంగి - కుషను చైరులోఁ గూర్చుండి చేయుచున్నాడు. ఇంక నీ గారడీల కిది కాలముగాదు.

ఎప్పుడైన బ్రహ్మజిజ్ఞాస జీవన్ముక్తి చే బడయుటలోనె చరితార్థ మున్నది తదితరము లన్నియు వ్యర్థములు. భ్రాంతి మాత్రములు ఇట్లే.

"నయోగేన నసాంఖ్యేన కర్మణానో నవిద్యయా
బ్రహ్మాత్మైకత్వ బోధేన మోక్షస్సిధ్యతి నాన్యథా"

అనఁగా యోగాది కర్మములు నిష్ప్రయోజనములని బ్రహ్మ బోధచేతనే మోక్షసిద్ధి గలుగుచున్నదని - శంకరుఁడు.

# వేదాంతము

వేదాంత శాస్త్రములయందలి ప్రతి విషయమును గ్రాహ్యమే కాని అందలి పేర్లు కొన్ని పారిభాషికములు కొన్ని సాంకేతికములు. కావున వాని భావమునే గ్రహింపవలయును గాని పదములయొక్క అర్థములు కావు. అనఁగా షట్చక్రములని నప్పుడవి బండిచక్రములవలె లేవు. ఇందు మొదటిది ఆధారమను చక్రము. ఇది మూలస్థానమున నుండును. దీనికి వ. శ. ష. స. అను నాలుగక్షరములు నాలుగు రేకులుగా నేర్పడి కమలా కృతినిఁ బొంది విఘ్నేశ్వరునకు నివాసమై యున్నదని చెప్పుదురు. ఇట్లే తక్కినవియు వర్ణింపఁబడినవికాని మత్తుమందిచ్చి ఆయాస్థలములు కోసి చూచిన నందేమియు గాన్పించవు ఆ యక్షరము లేలిపియో అందున్న వినాయకుఁ డెవరో యీ గజవదను డెట్టివాఁడో చక్రమేమిటో ఆ విష యమే మృగ్యమై యుండును. కావున వాని నిజభావములు తెలిసికొనవల యునేగాని శబ్దార్థములపై వేదాంతములు తెలియఁబడవు. మఱియు జ్ఞానం ప్రచ్ఛుతి సమ్మతం అని॥

"అవాగ్మనస గమ్యం తం శ్రుతీర్బోధ యితుం సదా" అని విద్యారణ్యుఁడు "వేదాంతో నామ ఉపనిషత్ప్రమాణం తదుపకారిణీ శారీరక సూత్రాదీనిచ" అను

నిర్వచనములు వేదాంతమునకు నుపనిషత్తులు శారీరక సూత్రములే ప్రమాణము లని చెప్పుచుండఁగా వేదబాహ్యములైన పౌరాణిక దేవతలగు శివవిష్ణు విఘ్నేశ్వరాది దేవతా సమాయుక్తమైన చక్రములు నాడులు, సాంఖ్యతారకా మనస్కము లనునవి యెన్నియో యిటీవల గల్పించఁబడి నట్లు తోఁచుచున్నది. ఇట్టివెన్నియో గ్రంథములగుపడుచున్నవి కాని విషయ మొక్కటే యెన్నిపొత్తములు చదివినను అవే మాటలు. అవే భావములు. అవే పర్యాయ పదములు పుస్తకమునకు అది మాత్రము క్రొత్త పేరు క్రొత్త పాత్ర ప్రాఁత పులుసు అనునట్లుండును.

మఱియు పూర్వము "మోసే కాలమున" సామరి యను నొకఁడొక దర్శన గ్రంథమువ్రాసి అందు తనను దేవుఁనిగాఁ బొగడుకొని అది కారడవినొక బాడిదచెట్టు దొలిచి యందుంచినాఁడు. ఆ చెట్టు కొన్నాళ్ళ కతుకుకొనిపోయినది. ఆచెట్టునొద్ద తనయింటఁ బుట్టిన ఆవుదూడకు మేతవేయుచు నలవాటుచేసియుంచెను. దూడ కన్నిత్రాడు విప్పిన తోడనే యా కారడవిలోని బాడిదచెట్టు నొద్దకుఁబోయి నిలిచెడిది. ఇట్లుండఁగా "ఈజిప్టు" లోని ప్రజల నందఱను పిలిచి నేనీశ్వరావతారమును నాతోఁ బశు పక్షి వృక్ష జాలములు మాట్లాడును. మీకేయుదంతము కావలసినను నేనాదర్శప్రాయుఁడనై యుందును. నాకు మీరందఱు శిష్యులై యుండవలయునని నిర్బంధించెను. వారు సరే! మీరేమైన నట్టి నిదర్శనములు మహత్తుచూపగలరా! యని ప్రశ్నించిరి. సామరి గోశాలకుఁబోయి ప్రజలారా మీరు నన్ను నమ్మకున్నారు నన్నీ పశ్వాది తిరియగ్జంతువులు నమ్మినవి నాధర్మము భూగర్భముకూడ వ్రక్కలించుకొనిపోయి అణువులందుగూడ మూర్తీ

భవించి విలసిల్లుచున్నది. చూడుడు రండు. అని తనలేగదూడ కన్నిట్లాడు విప్పెను. అది పూర్వపరిచయమునఁ దిన్నగాఁ గొరడవిలోని బాడిదచెట్టు నొద్దకుఁబోయి నిలిచినది.

సామరి—ఓ ప్రజలారా! యీ దూడ చూపించిన యీచెట్టు తనలో నాయవతారమును గూర్చిన మహాగ్రంథమున్నదని చెప్పుచున్నది అని చెప్పెను. ప్రజలు ఆ చెట్టును వ్రయ్యలు చేసిరి. అందుతాను వెనుక దాఁచిన పొత్తము బయలుపడినది. ప్రజలు మిక్కిలి యాశ్చర్యచకిత మానసులై సామరిని సర్వేశ్వరునిగాఁ బూజింప నారంభించిరి. అని బైబిలులోఁ గలదు.

ఇట్లే అనేకులు బంగారము సేయుదుమని దేవునిఁ జూపెదమని మహామోసము లొనరించెదరు. ఏ మోసము చేసినను మానవుఁడు కూడఁ దీసుకొనఁగలఁడు. కాని పరమార్థమున కడ్డుదూరువారి మోసము నతి క్రమింపఁజాలఁడుగదా. అది జన్మాంతరమునఁగాని తెలియదు. కావునఁ దప్పు బోధలు సేయువారు శిష్యులను లోకాంతరమున లొట్టియలై మోయ వలసివచ్చినని మా పితామహులు "కహనెషావలి" గారు నుడువుచుండిరి. కావున బ్రహ్మజిజ్ఞాసువులకు దురూహ్యమైన పరతత్వ విషయము ఎటుల దృష్టి గోచరమగునో యేరీతి నది యనుభవమునకు వచ్చునో యేతీరునఁ దృప్తి యాపాదించునో యెటుల జీవన్ముక్తిఁ గలుగునో అది సులభమైన చక్కనిదారి యేర్పరచి ఈతఁరానివాని కీతఁనేర్పి నీళ్ళవలని భయము మాన్పినట్లు భవభయంబులు బ్రహ్మజ్ఞాన సంపత్తిచేఁబాపి జన్మబంధంబుల బాఱఁద్రోలవలయును లేనిచో శుష్కమైన వాక్యాభాస యుక్త్యాభాసముల వలనఁ బ్రయోజనము లేదు.

మేము పెక్కు వేదాంతులయొద్దకు, శుఫీలయొద్దకుఁబోయి ప్రశ్నించి తిమి. వారలేనాదమునో యేచిత్కళనో యేయుపాసననో యాశ్రయించి యున్నారు. ఇది జీవన్ముక్తి యగునా? యని యడుగ తలవాంచి విన్నఁ

బోయినవారును ఏమో తెలియదనువారును, కొందఱు కన్నుల నీరు నించిన వారినిఁ గూడ నేనెఱుంగుదును. సెంట్రలిండియా నాగపూరులో సుప్రసిద్ధ భక్తుఁడైన తాజుద్దీన్‌గారివంటి వారును నిట్లే యున్నట్లు 1923 జూన్ 8వ తేదినాటి వారి ప్రసంగము వలన దెలిసినది. ఇట్లే పూర్వము వ్యాసుఁడు "వ్యాపి.... .... .... దోషత్రయం మత్కృతం" అని 6, విద్యలు నేర్చి నే నెవఁడనో తెలియనైతినని "బూఅలీ" యును విలపించిరి.

నాస్తికులలోఁగూడ నెందఱో గొప్పమహనీయులున్నారు. పూర్వము కపిలుఁడు, చార్వాకమతస్థాపకుఁడైన విరోచనుఁడు. పాశ్చాత్యులలో ఎపిక్యూరసు, (గ్రీసు) ఫిగాల్టు. లెబ్రను, పైరన్, అర్జన్, హాప్సు. నైగను, మహమ్మదీయులలో ఉమర్ ఖయాము, మున్నగు వారు నిరీశ్వరులైనను పాపము లేమియు చేయలేదు.

వీరిదొక విపరీతసిద్ధాంతము, చక్కని యుపమానములతో హృదయమును గ్రుచ్చుకొనిపోవు భావనైరశ్యములను సూచించు తత్వస్వరూపమును ప్రతిపాదించెదరు. ఆహా! అది నిన్న నెంతటి పాషాణ హృదయమైనను గిరగిర తిరిగి కరిగి నీరై నీరు పల్లమునకుఁ బ్రవహించుమాట్కి వారి మతమే సత్యమని అయాచితముగాఁ జెప్పసాహసించును. ఆ నాస్తికుల భావములు యుక్తులచేఁ ఖండింపఁబడక సురాపానము నందలి నిషావలెఁ బరిభ్రాంతులను సేయక మానవు. సూదంటురాయివలె నాకర్షింపక మానవు, కావున ఆస్తికులని వినుటగూడ నిషేధమని వ్రాసినారు, కాని మాకా పట్టుదల లేదు. ఎల్ల విషయములు విని సమన్వయము చేసికొని తాను తరించు దివ్యపథమ బాధకముగాఁ జేయుటయే మా పరిభాషాశయము.

## నా స్తి క వా ద ము

స్వర్గమునుండి దిగువారును చచ్చి చూచుచుండఁగనే నరకమునకుఁ బోవువారును నుండరు. ఎల్లరు తల్లిగర్భమునుండి పుట్టి స్మశానమునకుఁ బోవువారే. ఇందొకటి యాది రెండవది యంతము.

మఱియు ప్రమాణానేక బహువిధా దర్శములతో సంగీకరించిన మతము దాని యందలి శౌచశీలములు విశ్వాసము భక్తి, న్యాయము, ధర్మము మున్నగునవన్నియు నిరర్థకములు. బ్రతికెడు రెండుదినాలు హాయిగా బ్రతుకుటకివి ప్రతిబంధకములు బాధాకరములు.

ప్రతి నరుఁడును తన పురోభివృద్ధిని లాభమును ఇష్టసిద్ధినిఁ గలిగించు సావకాశమ లెట్టిపైనను సరే నిరాక్షేపముగాఁ జేసికొని పండు నలిచి తినునట్లు నిరాఘాటముగా తన సంకేతస్థానముఁ బడయవలయును.

ఉదారత చతురతచేఁ బూసలోని దారమువలె నెల్లర హృదయమునఁ బ్రవేశింపవలయును. పెటుకుఁదనము దుస్స్వభావము అసమర్థులకార్యములు.

ఆకాశమునందు మేఘములు నెచ్చటెచ్చట నుండియో గాలి ప్రోగు జేసికొని వచ్చి వర్షింపజేసినట్లు కాలము మానవజీవితములో నెన్నియో మంచిమంచి తరుణములు లాభములు గూర్చు సందర్భము లాకస్మికముగాఁ దెచ్చిపెట్టుచుండును. అట్టి యవకాశములు జారవిడువక ప్రయోజనకరము నగునట్లు తాను తనవారు ననుభవింపవలయును. ఇంతకుమించిన పరమార్థ మింకొకటి కలదనుట గొప్ప పొరపాటు. తపస్సులు, పూజలు, డాంబికుల హడావిడి తప్ప అందేమియును విశేషములేదు.

ప్రత్యక్షములైన వైహికవిషయభోగేచ్ఛలు విసర్జించుటయు మిథ్యాభూతములైన ఆముష్మికములకై ప్రాకులాడి కలదినంబులు తేరఁగ జారవిడుచు మూర్ఖుడు మూర్ఖుఁడుగాని కేవల మూర్ఖుఁడు మూర్ఖుఁడుగాఁడు. వాఁడు నీళ్ళు వదలి యెండ మావులకై పరువెత్తు మృగప్రాయుఁడు.

ఈశ్వరుండు సచ్చిదానందస్వరూపుఁ డని సర్వజ్ఞుఁడని చెప్పు తప్పుడు మాటలు పిల్లలు బొమ్మలకు పెట్టు పేర్లవంటివి. ఇట్టివి నమ్మువారి యజ్ఞానమునకు వగచి వారి కుతర్కము సాందనము విని జాలిపడవలయును లేదా? నవ్వి ఊరకుండవలయును.

ఆస్తికులగు మతబోధకులనిన గొప్ప మోసగాండ్రు లేదా గొప్ప భ్రాంతులు. మతము పేరిట నెందఱినో తమవంటి భ్రాంతులను తయారు చేయుచున్నారు. ఆహా! యెంతవెఱ్ఱి యెక్కుడి భగవంతుఁడు, ఏమిపూజ యేమి నైవేద్యము అతఁడొక మానవునివలెనున్నాఁడని మానవుఁడూహించిన పశువు పశువువలె నున్నాఁడని యూహించును. ఈభావాంతర్వర్తియైన భగవత్భ్రాంతి మొదలంట హేతువాదములపైని అనుమానప్రమాణములపైని, పనికిమాలిన కట్టుకథలపైని మోసియున్నది. ఆ యీశ్వరునిఁ జూచినవారులేరు. చూడగలవస్తువుకాదని వారేయందురు.

ఇంకఁ గలఁడనుటకు మూర్ఖమతావేశమే సాధనము. అదైనను మిక్కిలి నిస్సారమైన నమ్మిక చూడుఁడు. అంతాయీశ్వరుఁడని వారందఱు సరే జగమంతయు నీశ్వరుఁడైనయెడల మానవుఁ డందులోని యొకపురుగు ఈ పురుగునకా యీశ్వరునివలన నేమి ప్రయోజనము.

ఎవరో ఒకదైవ మున్నాఁడనుట నిష్ప్రయోజనమే కాక అది హృదయ శల్యమై వేధించుచుండును.

ఇంక త్యాగము దానము వైరాగ్యము సుఖానుభవపరిత్యాగము జ్ఞానము, ఆత్మసమర్పణము ఇవి యవలంబించమనుట ఆకొన్న వానికి నుపవాసముండుమని చెప్పుటవంటిది. దయ అనుదాని కర్థము లేదు. త్రాగెడు నీళ్ళు పీల్చెడు గాలియందును పురుగులున్నవి. ఇంక దానమందురా అదియును స్వార్థమే ఒక కుష్ఠురోగి కొకకాని దానమిచ్చెనన్న నాతనిఁ జూడ మనస్సొప్పక వెంటనే పంపివేయుటని యర్థము తక్కినవియుఁ నిట్టివే.

మానవుఁడన్నిటి కంటె పైభాగమున నున్నవాఁడు. ఏదోయొక మత సంప్రదాయము ననుసరించి చెప్పుకొన్న మాటలతోనే తత్వమంతయు ముగిసిపోలేదు. మిన్నులురాలిపడినట్లుగుపడినను పైనప్రదేశము లేదనరాదు

బ్రతుకు క్షణికమైనది. ఆ ఒక్కక్షణములో నేడ్చుచు కాలముఁ
బుచ్చుటకంటె నవ్వుచునె వెడలించుట మంచిది.

పుట్టుటకుఁ బూర్వముఁగాని గిట్టినతరువాతగాని మానవుఁడు లేఁడు.
బ్రతికి యున్నప్పుడే యీ జన్మమే సమస్తమునై యున్నది. ఇది దాటితే
మఱి లేదు లేదు. దీపమారిపోయినమీఁద ఆ వెలుతురు లీనమై మాయమై
పోవుచున్నది. ఆ జ్వాల యెక్కడికిఁ బోయినదో దాని పర్యవసానమే
మైనదో తెలియదు. అట్లే బొందినివిడిచిన ప్రాణము పలాయనమై వెళ్ళి
పోవును దానికిఁక దిక్కేమి జన్మాంతరమేమి. అట్టివి కలవనుటవృథాభి
మానము పెద్దమోసము, అందొక్క లేశమైనను నిజములేదు.

ధర్మపథమున నడువవలయునను మాటలువిన్న నెత్తిమోదు కొను
నట్లుండును. ఇవి చాల యసహ్యకరమయిన సంగతులు. ఏలయందురా
పాపపుణ్యముల కుత్తరవాదియై తేపు యేదేవునకో సమాధానము చెప్ప
వలసియుండునను నది మరణానంతరము జరిగెడు గ్రంథము అందేమియు
నిజముఁలేదు. స్వప్నమునఁ జేసిన కర్మ జాగ్రతయందెట్లుత్తది యగు
చున్నదో అట్లే నేడు చేయు పాపపుణ్యములు మరణానంతరము నట్టివి
యగుచున్నవి. దేహము విడిచి పెద్దగంతువేసి లేచిపోయిన జీవునిబట్టి
తెచ్చుట కెవరు కాచుకొని యుందురు. దేహము ప్రత్యక్షముగా దగ్ధమగు
చుండఁగా జీవుఁడు ఛాయా మాత్రుఁడై యున్నాఁడను కొన్నను దానిపై
తట్టెడు నిప్పులు పోసిన పోయనిమ్ము పోసినవాని తెలివితక్కువతనము
గోచరమగునేకాని దానివలన ఛాయకు బాధ యేముండును? మత్తుమందిచ్చి
నంతమాత్రమున జడములై పోవుచున్న జీవదేహములకు నరకమని స్వర్గ
మని యుండుట కెట్లు పొసఁగును.

చెట్లవలెఁ బుట్టటయు పురుగులవలె, ప్రాకుటయు, లేళ్ళవలెఁ బరు
వెత్తుటయు, పక్షులవలె నెగిరిపోవుటయు నైసర్గికమైన జీవవ్యాపార మిది
యొక ఓడు గెలుపులతోఁ గూడిన పాచిక. పాచిక నిర్జీవమైనను జీవ వస్తు
వులను తల్లక్రిందులుగా మార్చివేయుచున్నది. ఓడిన వానిని నేడ్పించు

చున్నది. అందులోని గూడార్థమేదో గ్రహించుట కెంతకాలమో పట్టును. పుట్టుపురుగు తనచుట్టును గూడల్లుకొని చచ్చును. అట్లే నీభ్రాంతిలో నీవు చచ్చిపోవుచున్నావు. నీ సంస్కారమే నిన్ను కడముట్టించుచున్నది.

ఈదృశ్యమయిన జగమంతయు మట్టియొక్క వికారము. తుదకు మట్టియై శాంతించును. ఈమట్టి యేమిటో గట్టిగాఁ దెలిసికొన్న నీకు సమస్తము బోధపడగలదు. అప్పుడే నీకానంద ముదయించును. అంతేకాని అభాసములైన నిర్వాహణములకై నిరీక్షించుట చచ్చిన వాని చెప్పులకై నిరీక్షించువాని హీన జీవనము వంటిది. కాని యిష్టమున్న వారట్టి భ్రాంతులకుఁ బోవచ్చును. కాని అయ్యో ఆస్వర్గమునఁగూడ రంభాది దేవతాగణికలు, వనములు, విహారములు, గానములు పానములు మున్నగు నానా విషయ లంపటములనంతములుగా నెదుర్కొనుచున్నవి. ఇంక నీ మహా సాదిత్యమున కంత మెక్కుడున్నది. ఆహా! అచ్చట దేవుఁడు దర్శనమిచ్చునందు రటులైన నాఁతడొక దోఁబూచి. గొప్పపక్షపాతి. ఏమందురా అతని కంతయు సమానమేయైన నీలోకమున నేల యగుపడగూడదు?

మాకీశ్వరుడన్న శూన్యమున కర్థము. మానవుఁడును శూన్యమే.

కాని త్రాడునందు భుజంగభ్రాంతివలె శూన్యమైన చైతన్యమునందు ప్రతిబింబితములైన మృత్తికారేణుసముదాయమే యీదేహము. దీనికి సుఖమని దుఃఖమని రెండుత్రోవలు ఈరెంటికిఁ బర్యవసానమొక్కటే. పన్నె గడ్డికొలుకుచున్నది. ఇవి రెండును జడములే. అనఁగా పన్నాడిపోవును గడ్డిమాడిపోవునుకాని గడ్డి కొలుకఁబడి వ్యధఁబడుటకంటె పన్నె కొలుకుచు నానందమనుభవించుట సమంజసము. కావున నేను నేనను నీవు ఉన్నంత దాఁక ఒక క్షణమైన బీలువోకుండ విలాసముగా నానందమునే యనుభవించుము. ఇదేమంచి బోధ దీనిలోనే సత్యమున్నది. తుదికెల్లరు స్మశాన వాటికకుఁ బోవుదురు. చితిపేర్చువాఁడే అన్నిటికి స్వస్తి చెప్పివేయును. స్మశానమే సర్వదేవతాస్థానము. ఎల్లరాయా రామమున బూడిదై ఘటాకాశము మహాకాశములోఁ గలిసినట్లు నామరూపములు లేకుండ అంతమయి

పోవుదురు. ఇదే మోక్షము మరణము. మరణమే తేపనునదిలేదు. అదియొక గొప్ప అంధకారము అది కాలగర్భములో నున్నది. ఇది కాదనువారు నగుబాటున కొన్పదులు వారి యుపన్యాసములు పిల్లలన్నము తినుటకు బూచి బూచియని భయపెట్టు కథలవంటివి. బాలకులకుఁ బంచతంత్ర కథ లెట్టివో పెద్దలకు వేదశాస్త్రము లట్టివి. అవియొక ఆటవస్తువులు.

దారులు కొట్టి స్త్రీలనెత్తుకొనిపోయి కొంపలు దోచుకొని గొప్ప భీభత్సములు సేయువారి దుండగములను బాపుటకు రాజశాసనములు లేని నాఁడు. ఈ వేదాంతేతిహాసము లేమియు కార్యకారి కాఁజాలవు. ఇంక నెవరికన్న యెండినయెడారి నీరు పీల్చివేయినట్లు, దరిద్రులకు మిక్కిలి రుచించును. మఱియు సోమరులకు వేషదారుల కిదియొక మంచి కాలక్షేప సాధనము.

అని యిట్లే మఱికొన్ని విషయములు నాస్తికులు నిర్వచించెదరు అవి యన్నియు నిజమైనను కాకపోయినను ఆస్తికులుచెప్పు కొన్ని విషయములు హిమవన్నగమువలె దోఁచుచు రూఢములై యుండఁ గాదని కన్నులలోఁ దుమ్ముకొట్టుట కెవరికిని సాగదు.

ఈశ్వరుడన్న శూన్యమున కర్థమని మానవుడు శూన్యమేయని యనుట మిథ్యావాదము కేవల యుక్తిప్రధానమైనది. సత్య మిందెంతయు కొఱవడియున్నది. ఏమనిన నీశ్వరుఁడే స్వర్గముననో యగుపడునను కల్ల కావచ్చును. కాని అసలే లేడనుట గొప్ప పొరపాటు ప్రమాదము. అతడు లేకపోలేడు ఉన్నాడు. ఈ దృశ్యమానమగు, విశ్వమానవ ప్రపంచ మంతయు గలిపితే యీశ్వరుఁడు. ఈశ్వరుఁడంటే వేరే యెక్కడను దాఁగొనిలేఁడు. కూటస్థాత్మకమైన సమిష్టి వ్యక్తికే యీశ్వరుఁడని పేరు అదే మీరొకవేళ శూన్యమందురే?

ఆశూన్యమునే చక్కఁగా గ్రహించి దాని యాద్యంతము లామూలాగ్రముగ గ్రహించి విమర్శించి యందులోఁ ప్రవేశించి ఆసత్యమును

తెర పైకెత్తివేసి దాని యగాథమగు లోతును దీసి యందు ప్రవేశించి వెదకి దాని నిజతత్వమును బట్టుకొని గట్టిగ శోధించిచూచిన మహాతేజో రూపకమైన శక్తి యుదయించును. ఆందానందము జనించును సంశయములు యిచ్చిపోవును. శూన్యములనుకొనునవి, యతేంద్రియములనుకొనునవి, ఈశ్వరాస్తికనిష్పత్తియను సత్యాంతర్భాగమున వాస్తవములై పొడc గట్టును. ఇదే సాధకునిసిద్ధి మహామ్మదువారీ శూన్యములోనే సదూపము (మేరాజ్) చూచినారు అదే భక్తులకు ధ్యానసమాధిని దృశ్యమగునని బోధించెను. ఈశూన్యములోనే "మోసే" ఆ యీశ్వరుని అగ్నివలెను. ఋషుల తేజస్సువలెను జూచినారు. మఱియు

శ్రు. ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః
నిష్కలం నిష్క్రియం శాంతం.

అని నుడివిరి.

ఇట్లే మూcడేండ్లు దాటిన పిల్లవాcడు తనసాటి పిల్లలతో నాడుచు అల్లరిచేయుచుండ తల్లి "యేమిరా అల్లరి చేయుచుంటివి అని యడుగ ఆ పిల్లవాcడు.

ఏమి చేయుమన్నావు?
తల్లి—బుద్ధిగా ఉండాలి.
"దేవుcడు బుద్ధి యిచ్చినప్పుడుంటానులే"
అలాగా ఒరే దేవుcడేలాగుంటాడురా?

దేవుcడేలాగున్నాcడా? కాళ్ళు చేతులులేవు తెల్లగా ఉన్నాcడు అమ్మా ఆకాశమునుచూచి వానిని పోల్చుకోవే యేమే అలా అడుగుతావు." అని చెప్పెను. నేనామాటలువిని చాల ఆశ్చర్యపడి తిరిగి వాని నేమిటేమిటని యడుగు సరికి వాcడా దృష్టిలో నుండి మాఱి మఱియొక ఆటలోc ప్రవేశించినాcడు.

ఇట్టి యీశ్వర యాదార్థ్యమును పరిత్యజించి గగనాదులపై తోటలు పేటలుకట్టి యేదో యొక యీశ్వరవ్యక్తి కలదని భ్రమించి బాధపడువారు కుప్పతిప్పలుగాఁగానబడు చున్నారు. ఆహా! వారి మౌఢ్యము మరల్ప వలయునన్న మనలనే మూర్ఖులని యెదురాడి కలహింప నుంకించెదరు. మఱియు నీశ్వర ప్రార్థనాదికము లన్నియు నిరర్థకము, నీరసములు, కాని పఞ్చపంచకమునందలి సూక్ష్మాంశములు అనఁగా అగ్ని, ఆపసు, సవిత మున్నగునవి యుపాసించిన అనఁగా వాని నొక వ్యక్తిగా మార్చి దానిపై తదేకచింత-దీక్షయుంచిన నది తనకు స్వాధీనమై దివ్యావకాశము లెన్నో గలిగించి మహదానంద సాంద్రునిగాఁ గావించుచుండును. కాని ముముక్షత్వము వేరు. ముముక్షువునకు సిద్ధులు సుకరమే కానిసాధనచేసియుండఁడు. కేవల సిద్ధునకు మోక్షములేదు. కావున మోక్షజ్ఞుఁడు సిద్ధులనపేక్షింపఁడు. బాలునియెదుట కలకండయు వెండి ముద్దయు నుంచిన నాతఁడు కలకండనే కైకొనగోరును. ఆబాలుఁడే పెద్దవాఁడై కలకండను వదలి వెండినిఁ గొనఁ జూచును. అట్లే తాత్కాలికానంద ద్యోతకములైన సిద్ధులను జ్ఞాని వదలి వేసి కేవల మోక్షానందపదవినే పరమావధిగాఁబెట్టుకొనును.

## ప రి ణా మ ము

మానవున కెన్ని నిజములు తెలిసినను జడత్వమును వదలలేఁడను సిద్ధాంతములోఁగూడ కొంత నిజము లేకపోలేదు. చూడుఁడు. శ్రీకృష్ణుఁడు తనకొక క్షణములో రానున్న మరణమును తెలుసుకొనలేక పోయినాఁడు. జీసను సిలువపై ప్రాణములువదలనున్నప్పు "దేలీయేలీ" యని యీశ్వరుని కాపాడుమని వేఁడుకొన్నాఁడు. పీరానెపీర్ పుత్రదుఃఖమున కన్నీళ్ళు విడిచినాఁడు. శంకరుఁడు తల్లిచావు విని దహనసంస్కారములకై వలవల వగచినాఁడు. అట్లేభక్తుఁడు భావవైకల్యములకు లోనగుచుండును. పూర్వ సంస్కారము లాతని నెంతయు నాక్రమించివేయుచుండును. మానవుఁడు భావతార్కికుఁడు. చేసి చింతించువాఁడు. గడిచిపోయినదానికై కూడ యేడ్చు వాఁడు. వాదమునం దోడని (Point) సమస్యయం గాదర ముంచువాఁడు.

క్షుత్పిపాసలచేతను అరిషడ్వర్గములచేతను పీడింపఁబడువాఁడు. ఇట్టివన్నియు జడత్వములు అయినను మానవ స్వభావమునైన నైమిత్తికాది జడభావములను నేరుగు మానలేరుకాని సంస్కరించుకొనుటావశ్యకమని చెప్పక తప్పదు.

## రెండవ ప్రకరణము

### - మానవుడు -

ఈశ్వరుఁడు జీవుఁడు అని రెండు వేరువేరు పదములు వినబడుచున్నవి. వానిని సమన్వయము సేయవలయునన్న నేవో కొన్ని యుదాహరణములఁ జేర్చక తప్పదు.

విత్తులో మొక్క ఉన్నట్టు ఈ భువనబ్రహ్మాండమంతయు నీశ్వరునిలో నున్నది. అవి ఉత్తర క్షణముననే జగత్తై పోయినది. ఆ యవధి మిగుల స్వల్పము ఇంచుమించు రెండును నేకకాలముననే సంఘటించినవను కొనినను ఈశ్వరవ్యక్తి ముందు, రెండవది ప్రపంచకము, తాళము త్రిప్పితే గెడవచ్చును. చంద్రుఁ డుదయించితే వెన్నెల, ఉరిమిన ధ్వని, ఇట్లు కార్య కారణము లొకే సమయమున జరుగుచున్నను వ్యవహారము మాత్రము తాళము త్రిప్పితే గెడవచ్చునందురు. అట్లే యీశ్వరునకుఁ బ్రపంచమునకుఁ గలయనురూపము తెలియవలయును. కాని చంద్రిచంద్రికలవలె జగదీశ్వరులు వేరు వేరు వస్తువులు గావు.

విత్తు చెట్టయినప్పుడు ఆ విత్తు వేళ్ళయందుగాని మానునందుగాని యుండదు. అట్లే జగత్తైన యీశ్వరుఁడు భూమిలోపలగాని ఆకాశముపై గాని యుండఁడు. అంతమాత్రమున శూన్యమనఁ జెల్లదు. చెట్టయిన విత్తు పండులో నగుపడునట్లు జగత్తైన యీశ్వరుఁడు మానవునిలో నగుపడుచున్నాఁడు. అనఁగా మానవుఁడును ఈశ్వరుఁడును నొకే రూపమని యర్థము. "ఖలఖతుల్ ఇన్సాన అలానూరతెహి" నావలె మానవుని సృజించితిని అని ఖురాన్.

మఱియు కొండ ఫోటో (Photo) తీసినట్లు బ్రహ్మాండమంతయు ఫోటోతీసిన సరిగా మానవాకృతి వచ్చితీరును. మానవుని (Expand) విశాలపరచిన బ్రహ్మాండాకృతి వచ్చును. మానవుఁడన్న నీశ్వరుని సూక్ష్మరూపము, ఈశ్వరుఁడన్న మానవుని విశాలరూపము. కావుననే మానవుఁడు స్వప్నమునఁ బ్రపంచమువంటి తన విరళరూపమును దాల్చు చున్నాడు. ఇదే సాధనలోఁబెట్టి శ్రీకృష్ణాదులు విశ్వరూపమనుపేర చూపించినారు. పాశ్చాత్యుల మెస్మరిజము కూడ నిట్టిదే తనలోగల విశ్వ మునే బాహ్యమున చూచుచున్నారు. తనలోలేని వస్తువు మానవుఁడు చూడలేఁడు. అను తత్త్వజ్ఞులమాట కల్లకాదు కావుననే తారతమ్యము లేర్పడుచున్నవి.

సర్వజ్ఞత్వాదిగుణవిశిష్టుఁడు సమష్ట్యాత్మకుఁడు డీశ్వరుఁడని కించిత్ జ్ఞత్వాదిగుణవిశిష్టుఁడు వ్యష్ట్యాత్మకుఁడు జీవుడని యీ యుభయుల కీషద్భేద మని సముద్రమువంటివాఁ డీశ్వరుఁడని అందొక చుక్కవంటి వాఁడు మాన వుఁడని కావునసముద్రమునకుండు మహత్తు చుక్కసముద్రమున కన్యము-గాదని యిట్లే జీవేశ్వరులనుఁగూర్చి తెలియవలసినదని పెక్కు గ్రంథార్థము లుగ్గడించుచున్నవి.

ఇందు కపిలాదిసాంఖ్యు లేవ్యక్తికావ్యక్తి ముక్తిఁ బడయునను చుండ-ఆత్మ ముక్కముక్కలుగా భాగింపఁబడవలసి యుండుననియు అటుల తుత్తునియలగు ఆత్మద్రవ్యమువలె నుత్పత్తి వినాశనములు, వృద్ధి క్షీణములుగలిగి బంధమోక్షాది బహువిధ వ్యవస్థల కాకరమగునని అట్లగుట సంఘటించదు కావున ఆత్మ అవ్యయమని ద్రవ్యమునుగాదని ఆకాశము వలె సర్వవ్యాప్తమైనదని ఘటాకాశమువలె ఆత్మ దేహాదులయం దగుపడు నని అద్వైతవాదులు చెప్పుదురు.

ఇదియును పూర్వోక్త నిరీశ్వరవాదమువలె కేవల యుక్తిసహమై వాదమునకు లొంగక మంచి విశ్వాసమును గడించుట కనువుపడుచున్నదే కాని యెంత విచారించినను ననుభవమునకు సరిపడుటలేదు. ఘటాకాశము

మహాకాశమునఁ గలిసిపోయిన తిరిగి ఘటమేర్పడిన నందాకాశమును నేర్పడును. ఇంక జీవత్వాధివికారవ్యవహారము లెప్పటియట్లు కులాల చక్రమువలె వచ్చుచు పోవుచుండును. కావున దీనికిని ననావస్థాదోషము పట్టుచున్నది. ఇట్టి యుక్తిప్రతియుక్తి రూపకమైన వాదములచే లభ్యమగు జ్ఞానము మిక్కిలి మలీమసమైనది. నీటిలోని తుంగవంటిది. ఏనుఁగునకుఁ బైకగుపడు దంతములు నమలుట కక్కఱకురావు. అట్టి వాదాలవల్ల తేలే జ్ఞానము ఫలమియ్యక పోవచ్చును.

## ఈశ్వర సాక్షాత్కారము

ఆత్మ సాక్షాత్కారమునకే యీశ్వర సాక్షాత్కారమని పేరు. వేరే యీశ్వర సాక్షాత్కారమని తనకన్యముగా నగుపడు మఱియొక వస్తువు లేదు, ఉండదు. ఆలాగెవరికైన నీశ్వరవ్యక్తి పరోక్షముగా నగుపడిననది భ్రాంతియని యెఱుంగవలయును. మఱియు సమాధి స్థితియందు ముముక్షువులగు వ్యాసాది వలీ లగుపడవచ్చును. అంతే గాని జగత్ప్రతీతిగల యీశ్వరాదు లగుపడుదురనుట కల్ల అది యెంతమాత్రము విశ్వసనీయము గాదు.

ధృవునకు మార్కండేయాదుల కగుపడిన యీశ్వరుఁడు భావమాత్రుడు. అట్టి ప్రత్యక్షము సర్వసామాన్యముగా తాపసుల కెల్లరకగుట గలదు. పరితాపముతోఁ గూడిన తదేక దీక్షకే తదేక లక్ష్యమునకే తపస్సని పేరు.

ఆ దీక్ష పైగా నెచ్చటనో యీశ్వరుఁ డున్నాఁడని పొరపాటున నాతనిగుణానువర్ణనము మిక్కిలిగా సలుపుచు వేఁడఁగా వేఁడఁగా అది కొన్నాళ్ళకు అంతర్లీనమై తన్ను తానే చూచుకొనుట తటస్థించును. అదే యపరోక్షానుభవమగు బ్రహ్మసాక్షాత్కారము. అదే జీవన్ముక్తి. కాని యిట్టి యనుభవముచాల కష్టతరమైనది. ప్రాచీనులగు ఋషులు ప్రవక్తలు ఇంచుమించు నేటివఱకుఁగల బోధకు లిట్టిమార్గమునే యను

సరించువారుగా నున్నారు. వారి సిద్ధి, వారి ప్రబోధము కర్మ (షరీయత్) ప్రధానమైనను జ్ఞానప్రధానమైనను సత్యమును శాఖాచంక్రమణముగాఁ జూపుచు క్షణికమైన ప్రపంచజీవితమునందు మహాభీభత్సమగు సంసార సాగరనిమగ్నులగు జిజ్ఞాసువులకు బహుకాల సేవాతత్పరతచేతగాని లభించి నేరదని దానినే యుపదేశించుచున్నారు. అదియేసరియైనదని ప్రతిజిజ్ఞాసువును భావించుచున్నాఁడు. వాని భావమును మరలించుటకు సాధ్యముకాకపోవు చున్నది. కాని అట్టి పాత్రత పంథలన్నియు వదలి కేవల "ఆత్మ" ఉన్నది యున్నట్లుగాఁ దెలిసికొని వేదాంత విజ్ఞానమంతయు క్షణములో ముగించ వలయును. ఉత్తర క్షణమనునది లేదు.

ఏక్ ఖదం మే ఖుదాక త్తై పానా
బే సమఝు కుకహాహై మవ్ కానా

అనఁగా ఈశ్వరు లొక్కయడుగులో పొందవలయును లేకున్న మూర్ఖునకిఁక నాత్మ సాక్షాత్కార మెక్కడిది? అని యొకభక్తుడు.

తాను ఈశ్వరుఁడనగా ఆత్మ, ఆత్మయనగా తాను.

టార్పెడో యోడలెక్కి జలగర్భములు భేదించుకొని పాతాళ మునకుఁ బోవు తెఱవులు కనిపెట్టినవారును విమానారూఢులై భూమి విడిచి యాకసము గడిచి భువర్లోకము నక్షత్రాదిలోకములకుఁ బోవు వారును కొండ కడుపుచ్చక్కలి మణుల మణిజాలంబులు బడయుత్రోవలు కని పెట్టినవారున్నారేకాని తానెవరో తెలిసినవారులేరు. ఆప్రసంగము వచ్చి నప్పుడెల్లవార లంధులై పోవుచున్నారు.

నేననఁగా ఎదుటివానికి నేనేలాగున నగుపడుచున్నానో అదే నేను. నేను నేనను నిశ్చయజ్ఞానమే బ్రహ్మసాక్షాత్కారము. ఇదే జీవన్ముక్తి. జీవన్ముక్తునకు ఈ జగత్తొక నల్లపూసవలె దోఁచును. మిక్కిలి నీరసముగా దోఁచును. భయ విరహితముగాఁ దోచును. తన్నుతాను తెలియనంత

వఱకు తానీ లోకమున నొక పురుగువలె నుండును. తానెవరో తెలిసిన వెనుక నీ లోకమే తనలో నొక యణువై పోయి యుండును. సంశయ మను తెర నెత్తివేసితే బాహ్యాంతర సమస్త పదార్థములకు సాక్షియై నాటక రంగము ప్రక్కనున్నవారికి నటకుని నిజస్వరూపము గోచరమగునట్లు ఈ సృష్టి రహస్యమంతయు తేటతెల్లమైపోవును. అదే యానందము. ఈ బ్రహ్మానందానుభవమునకై పెక్కురు పెనఁగులాడుచు దోఁబూచులాడు చున్నను అసలు ఈ ముడి వీడక నేననే రహస్యము తెగక జీవభావములో పడి కొన్నివేల యోజనముల క్రిందకు దిగిపోవుచున్నారు. అదే భ్రాంతి యిట్టి భ్రాంతి పోవుటకు నీశ్వరుని సంపూర్ణ స్వరూపము మున్నగు తత్వ రహస్యములు మీ యెదుటఁ బెట్టినాము. ఇది మీరు మననము సేయకున్న నది మీదే లోటు.

## మ ర ణ ము

"మరణము మరణమే మరణానంతరమంతా మిధ్య ఈ మరణమే అన్నిటికి స్వస్తి చెప్పు బలిపీఠము. అదిగో స్మశానము భయముచే సంక్షుభితమై మిక్కిలి భీభత్సముగానున్నది. దీనికావల నేమియును లేదు." అను నిరీశ్వర సిద్ధాంతము దేహాదులను వదలిపోవుటకుమాత్రమే సూచించు చున్నది. కాని జీవన్ముక్తి అనఁగా బ్రతికియుండఁగనే శరీరపరిత్యాగమగు ఆత్మ తత్వవిజ్ఞానమునకివి కేవల బాలబిభీషికా ప్రసంగ సంగతములు.

ఆత్మ (బ్రహ్మ లేక హఖ్) యైన తనకిప్పుడే ఒక వ్యక్తిత్వ మును (Personality) ప్రత్యేకతయు ప్రత్యక్షసాక్షాత్కారమైన నిజ స్వరూప నిష్పత్తియు బంధరహితమైన యానందమును నేననే కృతనిశ్చ యమువలనఁ గలుగుచుండ మరణమని వేరుగ నొక యాకస్మిక పరివర్త నము లేనేలేదు. రానేరాదు. ప్రకృతిచే గోచరములగుచున్న మరణాది వికారములు నిద్రమత్తున జోగువాఁడు జోగి జోగి పడి నిద్రించి లేచును. అట్టివానిలో నేమిమార్పును రాక ఆ నిద్రాబద్ధక మొక్కటి మాత్రమే

పోవును. అట్లే యాత్మయైన తనలో కలుగు మరణము మరణవాసనను మాత్రమే తీసివైచి తాను యథాప్రకారమే తానుగా నుండును. అద్దముపై ముసుఁగు తీసివేసినప్పుడందు ప్రతిబింబితమైన ముసుఁగును ఛాయయుఁ బోయి అద్దము అద్దమువలెనే యదార్థముగా నున్నట్లు మరణానంతరమాత్మ యాత్మగనేయుండి దుఃఖరహితమైన సుఖమునే పొందును. అనఁగా బ్రతికి యున్నప్పుడేస్థితి నుండునో యేజాడ నేపక్కి నేతీరున నుండునో యదే తీరున నుండును. దీనినిగూర్చి యింకనుముందు వివరింపఁబడును.

దుఃఖము లేకున్న సుఖమెట్లు తెలియునందురా? తెలియును. విశ్వ శరీరియైనప్పుడు తనకాశ్రయమైన జడములయందు దుఃఖనివృత్తి కర్థమైన నిరంతర విజయము (Success) గలుగుచుండును. అదేయానందము. అది జాతీయముగను సహజముగను నుండునుగాని విషయముగా నుండదు. కావుననే పెక్కురు మృతుల-గోరీలయొద్దకుఁబోయి మనోరథములఁ బడ యుచుందురు. ఇట్టివే తిరుపతి మున్నగునవియని యెఱుంగవలయును. బాగ్దాదు మండలములో నేడవశతాబ్ధప్రాంతమునబుట్టిన అబ్దుల్ హసన్ ఫీరఖాని యను బాలుఁడు బాయజీద్ బుస్తామి గోరియొద్దకుఁబోయి ఖురా నభ్యసించెను. గోరీలోనుండి పాఠము వినవచ్చుచుండెనట.

యాజ్ఞవల్క్యుఁడు వైశంపాయనునియొద్ద యజుర్వేదము నేర్చి కొనియెను. వైశంపాయనునకొకసారి కోపమువచ్చి నావిద్యనాకిచ్చి వేయు మని యడుగ యాజ్ఞల్క్యుడావిద్యఁ గ్రక్కివేసెను, తిరిగి యాతఁడు సూర్యునియొద్ద నేర్చుకొన్నాఁడు. ఇట్టివి యిప్పటికిని సాధ్యములే. బరం పురమునొద్ద ఇచ్ఛాపురమున ఫకీరుకొండపై నేటికిని విద్యార్థులు పోయి కృతార్థులగుచున్నారు.

## దే హ ము

చైతన్యమునఁ బ్రోగుపడిన మృత్తికారేణు సముదాయమే దేహము. నీళ్ళయందు మట్టికలిసి యెఱ్ఱఁబాఱినట్లు ప్రకృతిచేఁ బ్రతి

బింబితమైన యాత్మ (చైతన్యము) దేహమువలెఁ దోఁచును. కాని పాల యందు నెయ్యివలెనే దేహాదుల యందాత్మ యేర్పడుచున్నదని యెఱుంగ వలయును. పాలు వెలుగవు నెయ్యి వెలుగును. నెయ్యిపాలలోనిదేయైనను సక్రమముగాఁ దీసినప్పుడే యది వచ్చును. గాని లేనినాఁడది క్రుళ్ళి పోవును. అట్లే దేహాదులు తరచినప్పుడే ఆత్మతత్వము స్థిరపడును. లేని నాఁడు నిరీశ్వరుల వాదప్రకారము ఉప్పుసముద్రములోఁ గలిసినట్లు అభావ మును పొందును. కావున మానవునకు బ్రహ్మజిజ్ఞాస మిక్కిలి యావశ్య కము లేకున్న ప్రకృతిభార మణఁగదు. నీట మునిఁగియున్న వానినెత్తిపై యెన్నివేల కడవల నీరున్నను వానికది బరువనిపించదు. పైకివచ్చి యొక కడవ నీరు నెత్తి నెత్తుకొనుమన్న నాతఁ డెంతయు వగఁజెందును. అట్లే ప్రకృతిబద్ధులకు దేహము భారముగాదు. ప్రకృతిపరిత్యాగుల కిదియొక లేశమైనను మిక్కిలి బాధాకరముగనే యుండును.

## యోగము

ఒకటి రెండుమాటలు దీక్షాబద్ధులై విన్న బ్రహ్మజ్ఞానమంతయు తెలిసి ఫలసిద్ధి వచ్చివేయును. అవి రెండు మూఁడు తరగతులుగా విడఁ దీసి యౌషదభ్యాసమున ఆ దృష్టి ఆ దీక్ష ఆ తదేక లక్ష్యము అనఁగా వ్రేలివంకఁ జూచిన ఆ వ్రేలేగాని రెండవవస్తువు అగుపడరాదు. అట్టి నిదానము అలవరుచుకొన్న ఆ దృష్టి తనయందు నిలిచినప్పుడు తన్మ యత్వము (యోగవిద్య) వచ్చివేయును. దీనినే యోగము లేక నిమాజు మఱియు తురీయము తురీయాతీతమని చెప్పుదురు. ఈ స్థితి వచ్చినవానికి పరంజ్యోతి ప్రత్యక్షమగుచుండును. ప్రణవనాదము శ్రవణ శ్రావ్యముగా వినిపించుచుండును. దానితో నన్ని సంగతులు తనంతట తనకే యర్థమైపోవును. ఇంక నడుగవలసినవి తెలిసికొనవలసినవి యేయర్థ ములును నుండవు. బాహ్యాంతర రహస్యములన్నియు దెలిసిపోవును. అంతటితో నీజ్ఞానకాండ మంతయు ముగిసిపోవుచున్నది.

దీనికై వేలకొలంది లక్షలకొలది గ్రంథములు సాధనములు, యోగములు, ముద్రలు, వివిధభాషలలో వ్రాసి పెక్కు సాదృశ్యములు చూపి యపారమగు సాహిత్యశిల్పములగుపరచి యున్నారు. ఆమహాఘాతజలార్ణవమునఁ బడెనేని మఱి యీజన్మకు పైకిలేచుటకు సాధ్యముగాదు. అవి యిసుకపాఁతరవలె పెక్కు బుద్ధిమంతులచేఁ దార్కిక సంప్రదాయములను బట్టి నిగూఢముగాఁ జర్చించిన మహావిషయములే అపురూప విజ్ఞానప్రదమగు దివ్యమార్గములే అవి చదువుటకు వినుటకు నాచరించుటకు మిగుల నాసక్తియు నుత్సాహమును జనించును. కాని యొకప్పుడు ఫలసిద్ధికి వచ్చుదమన్న నివియన్నియు రాకాసులై యద్భుతగులవచ్చును. అవి పద్మవ్యూహమువలె అభేద్యమైయప్రస్తుతమై ప్రాణసంకటములై పోవచ్చును.

బాగుగాఁ జదువుకొన్న కొందఱు విద్వాంసులు వలయాకారముగ, గూర్చుండి "అల్లాహూ" అనుమంత్రము నెలుగెత్తి యఱచు చుండిరి. అదే ముక్తియనుకొనుచున్నారు. కొందఱేదో జ్యోతిని నాదమును చూపుమని చూడవలయునని పలుబాములు పడుచున్నారు. ఈ పద్ధతిగల వికారవ్యవహారము సర్వాత్మనా తీసివేసినగాని గాజుచిమినీ సుద్దతో తోమివేసినట్లు పూర్వవాసనావేసితమైన భ్రాంతిజనకములగు గాఢాజ్ఞానమంతయు మనస్సునుండి శుభ్రముగా పులిమి వేసినగాని మేము చెప్పు తత్త్వప్రతిపాదకమైన మహాజ్ఞానమంటనేరదు. అసలు అర్థమేకాదు. మీ కన్నులకు నెఱ్ఱనియద్దాలు పెట్టుకొన్న జగమంతయు నెఱ్ఱఁగా నగుపడును. అది తీసివేసిన ఉన్నది యున్నట్లగుపడును. అట్లే పూర్వపరిచితమైన పరోక్షభావములు వదలవలయును. ఆవల నిజము బయలుపడును. ఇది సత్తా అసత్తా నిర్గుణమా సగుణమా యని తెనఁగు లాడజనదు.

రాఘవపాండవీయము వ్రాసినకవి ప్రతిపద్యమునకు రెండర్థములున్నవి. అవి యేక కాలమునఁగాక తొలుత రాఘవార్థముగనో పాండవార్థముగనో యర్థము చేసికొని తరువాత రెండవది గ్రహించుఁడని వేడినట్లు మేము చెప్పు ఈబోధ తొలుత సద్వస్తువుగా గ్రహించి ముగించిన

వెనుక నాస్తికాది అసద్వస్తువుల కవకాశమెటుసంఘటించెనో తెలిసికొన వచ్చును. ఇదియొక చిన్న పొత్తమైనను ఇందలి ప్రతి చిన్న విషయ మునుగూడ విడువక దృష్టిపథమునందుంచిన గూఢార్థములెల్ల తేటతెల్ల ముగ విడిపోవును. ఛిన్నసంశయులై మోహమును జెందరు.

## గు రు వు

బ్రహ్మజ్ఞాన ముపదేశించువాని కాప్తుఁడందురు. అప్తుఁడన మంచి చెడ్డలయందుఁ దోడ్పడువాఁడును భేషజము లేనివాఁడును అని యర్థము. ఒక శిష్యునికొక గురువీశ్వర సాక్షాత్కార ముపదేశింప నాతనికి గేదె కని పించినది. గురూజీ! నాకు గేదె యగుపడుచున్నది. ఈశ్వరుఁ డగుపడలేదని చెప్పినాఁడు.

గురువు విని నీవు పూర్వాశ్రమమున గేదెను మేపినావు. అని చెప్పి వానికాభ్రాంతినుండి తొలఁగించెను. గురుశిష్యులకంత స్వతంత్రత యుండవలయునని భావము. చీఁకటిలో చిన్న వస్తువు దీపము కన్నులున్న నగుపడును. దీపముపెట్టి కన్నులు మూసినను కన్నులువిప్పి దీప మార్పి వేసినను వస్తువగుపడనేరదు. అట్లే దీపమువలె గురునిసహాయమున శిష్యుఁ డీశ్వరు నెఱుంగవలయును. ధ్యానసమాధిలో గురువును నెదుటను చూడ వలయును. ఆ దృష్టి అలా లగ్నము చేసితే గురువగుపడును. ఇది మొదటి (Stage) రంగము.

## మ ం త్ర ము

బ్రహ్మజ్ఞానసాధనమునకు మంత్రము అక్షరాభ్యాసము వంటిది "గాయత్రి" "కల్మా" ఇవే మంత్రములు. మంత్రములన ఈశ్వరరూప నిష్పత్తిని ప్రతిపాదించునవి. ఇవి పూసలలోని దారమువలె భక్తులను నొకటిగాఁ జేయు కట్టుతాడు. సూదంటురాతి నంటిన సూదు లొక దాని నొకటి యాకర్షించినట్లు దీనివలన సంఘీభావమును సుస్థిరచిత్తము (Concentration)కుదురును.మానవునిలోనివిద్యుచ్ఛక్తి(Electricity)

సుషుమ్నా(షారగ్) నాడియందున్నది. ఆద్వారము తెఱచి పరమార్గమునం డంధకారము లేకుండ సేయు దీక్షకివి సాధనములు. భవసాగరము దాటుటకు మంత్రము పడవవంటిది.

గాయత్రి॥ ఓం భూర్భువః స్వః తత్సవితుర్వ రేణ్యం
భర్గో దేవస్య ధీమహి ధియో
యోనః ప్రచోదయాత్ ॥యజు॥ ౩౬ మం ౩॥

కలామ్॥ లా ఇలాః ఇల్లల్లా॥ ఇల్లల్లా
మహమ్మద్ రసూ లిల్లా॥

భాండశుద్ధిలేని పాక మపూజితమైన తెలంగున సద్గుణసంపత్తి లేని వానికి బ్రహ్మవిద్యరానేరదు. ఒక గురుసంప్రదాయమునకుఁ జేరిన వారందఱొక చెట్టునకుండు శాఖలవంటివారు. ఏవంక వ్రేళ్ళకే మాత్రము నీటిచెమ్మ లభించినను, నది చెట్టంతకుఁ జివరాకులదాఁక పచ్చబాఱఁజేయునట్లే శిష్యుఁడు తపస్సు చేసినను ఆ తపోఫలశక్తి యెల్లరకుఁ గాసంతకాసంత పంచబడునని యెఱుంగవలయును. మఱియు తపస్సుచేసినవారి కేమియు తఱుఁగదు.



# కృతి

శా. శ్రీ యాఖైలలీషా గురూత్తముని సం
సేవించు విద్యాపరీక్షా
ప్రాయంబైన వెలుంగు నింగిత ముషః
ప్రాభాత సంధ్యాతమో
ధ్యాయం బైన నిశాకవాటముల హృ
ద్ధ్వాంతంబుతోఁబాటు పోఁ
ద్రోయం జాలు తదీయ తేజ మొదనెం
తో వేట్కఁ నర్పించెదన్.

# పీఠిక

పరమ తత్త్వార్థ ప్రతిపాదకంబును నిహపర తారకంబును నానా కలుషాపహారంబును నగు నీ వేదాంత "పరతత్త్వ కీర్తనములు" పీఠికాపుర వాసులును మజ్జనకులు వివిధ భాషావిదులును విజ్ఞాన యోగసాధన మంత్రాది విద్యావేత్తలునునగు శ్రీశ్రీ మొహియద్దీన్‌బాద్షా గురువర్యులచే రచింపఁబడినవి. ఇందనేక తత్త్వజ్ఞాన రహస్యము లధ్యాత్మక కళాకోవి దులు తెలియవలసినవి గలవు.

ఇది పదకవిత్వము - పదకవిత్వము లాక్షణికులు కవిత్వఁ లక్షణ మునఁ జేర్చికొనలేదు. ఇం దుదాత్త అనుదాత్తస్వరము లారోహణా వరోహణములచే హ్రస్వములు దీర్ఘములు దీర్ఘములు హ్రస్వములై వికృతాకృతిఁ గలిగియుండును. అయినను రాగము మేళవించుటచే శ్రవణశ్రావ్య మాపాదించుచున్నది. "రసాత్మకం కావ్య" మనునదియు లాక్షణిక మతమైనను చందోబద్ధమగు కవిత్వమునకే వర్తించుననుచున్నారు.

ఇవి నే నందందు సవరించితిని. కాని వ్యాకరణాదిచందోదోష ములు నివారింపఁ బడలేదు. ఇవి భావప్రధానములు వేదాంతవిదులకే గాని తదితరులకు దురవగాహములై యుండును.

వేదాంతమునకుఁ బరమావధి సమాధి. సమాధిస్థితినిఁ బడసిన సాధకుని దృష్టి ప్రపంచమును పరబ్రహ్మముగనో నల్లపూసగనో చూడఁగలదు. కాని యది యనుభవైకవేద్యము గావున వ్రాసి యక్షర ములలోఁ జూపింప సాధ్యముగాదు. కావున భక్తులు అక్షర సాంకేతిక మైన విద్యను లెక్కింపక ఆత్మవిద్యనే ప్రధానముగాఁ బెట్టుకొని వారి కేది యగుపడునో అదే ఆ రీతినే అయాచితముగా పాడ నారంభించెదరు. అవి యొకప్పుడు వ్యాకరణబద్ధమైన స్వచ్ఛమైన భాష కాకపోవచ్చును.

కాని అందెన్నియో నేర్చుకొనవలసిన రత్నసదృశములైన భావవైర శ్యము లుండును. అట్టివి పరతత్వ కీర్తనములు చదివినవారి కెఱుక పడకపోవు. ఇవి మా తత్వగ్రంథమాలకు రెండవ కుసుమము.

ఈ పరతత్వ కీర్తనములు రచించిన శ్రీ మొహియదీన్ బాద్షా గారు 96 ఏండ్లు అవిచ్ఛిన్నమగు దివ్యజీవనము గడిపి స్వస్థానమున క్రీస్తుశకము ది 10-2-1928 సం॥ తేదీని తమ భౌతికకాయమును చాలించి దివి నలంకరించిరి.

వీరి వంశము బ్రహ్మవిద్యకానుపూర్వికమైనది. పూర్వము పారశీకమునుండి ఢిల్లీగుండా హైదరాబాదునకు వచ్చి పిఠాపుర సంస్థాన స్థాపకులతో నిచ్చటకు వచ్చి నివసించెను. అటుల వచ్చిన మొదటి పురుషుఁడు "మదీను కబీర్‌షా" వీరి యాధ్యాత్మకశక్తులు ప్రజలు పరీక్షించి యెందఱో శిష్యులుగాఁ జేరిరి. అది మొదలు ఆంధ్ర దేశమున వీరి పీఠము నెలకొల్పఁబడినది. గాని మా పితామహులు "కహనేషా" గారు బాల్యముననే తమ పితరులను గోల్పోవుటచే మహాయోగియు నవతారియునగు శ్రీశ్రీ అఖిల్ అలీషా గురుస్వాముల వారి అండఁజేరి తిరిగి బ్రహ్మవిద్య నభ్యసించి లోకసామాన్యమునకుఁ బ్రబోధించుట కారంభించెను. అది యీ కృతి కర్తలగు మా తండ్రిగారి నాటి కీశిష్య వర్గ మాఱువేల వఱకుఁ జేరినది. ఇందు బ్రాహ్మణాది చాతు ర్వర్ణములును మహమ్మదీయులును పెక్కుఁడు గలరు.

అందు పండితులు కవులు పెక్కుకృతులు రచించిరి. వాని వివర మిందు దాహరించిన గ్రంథవిస్తరమని మానివేసితిని.

పిఠాపురం
10-6-30

ఇట్లు,
ఉమర్ ఆలీషా

శ్రీ

# పరతత్వ కీర్తనములు



హాయరీరాగము - ఆటతాళము

ఘనశక్తి యుక్తుఁడవు - ననుబ్రోవుమీ పెద్ద
పనిగాదు భక్తుఁడను - గురురాయా ॥గురు॥
మును నీవిరాట్రూప - మున జగముదయించె
గను నే నన్యుఁడగాను - గురురాయా ॥గురు॥ 1

క్రిందుమీదెఱుఁగని - కందూలతోఁగూడి
నిందాల పాలైతి - గురురాయా
అందమైన సదా - నందయోగమగ్న
మందుంచి నన్నేలూ - గురురాయా ॥గురు॥ 2

నాదమె నరుఁడు చి - త్స్వధాన మెఱిఁగిన
వాదాము లడుగంటు - గురురాయా
మోదాముతోబిందు - పాదామె కళ ప్రణవ
పాదోధి యెదఁజూపు - గురురాయా ॥గురు॥ 3

భుజములె నయనాము - లజునీదె యెఱుక నీ
స్రుజనయె వాక్కూలు - గురురాయా
నిజజీవ స్థానాము - నీది భావము నాది
భజియించు నను బ్రోవు - గురురాయా ॥గురు॥ 4

సాహస్రారము మించి - యూహించి చూచితే
దేహ మధ్యమునందు - ॥గురు॥

సోహంబనియెడు ఆత్మ మోహరహితమై సం
దేహము లడగించె - ॥గురు॥ 5

ఎందెందు వెదకిన - నందందె గలవని ని
న్నందా రందరు గాదె - గురురాయా ॥గురు॥
డెందంబులో జీవి - చందంబుగా వెల్గు
చుందూవు రేపగలు - గురురాయా ॥గురు॥ 6

పదద్వందములు వాయా - పదమూలె శి తనువు
మొదటి ప్రణవము జూడ - గురురాయా ॥గురు॥
సదయ యాఖైలలిషా సామి మొహియదీన్ బాష్యా
ముదమారఁ బ్రోవుమీ గురురాయా 7

క. సత్వము శాంతమును దయా
తత్వము చిత్తమున నిల్పి - లోలత గుణ సం
గత్వము వదలి సతంబును
సాత్విక సదసద్వివేక - సంపదఁ గనుమా.

జాలికాంభోజి - అటతాళము

తెలుసుకో వశమా - ఓమనసా నిను తెలుసుకో వశమా
చెలిమినిగాఁ బలిమినిగా సులువునఁగాని ॥తెలు॥ 1

నేనై నిలిచిననూ - ఓంకారమెద
లోను విడిచిననూ - నా నిలిపిమా
లోను దోఁచిననూ - శివ శూన్యమహా
తానె పల్కిననూ - నీమహిమలె
న్నేని నేర్చితేను మురయుచు మోహముననను
పరవశమాయె - మేను

మనవంటిని వినుమంటిని
కనుమంటిని చనువునగాని ॥తెలుసు॥ 2

ఏలా వెడనైతి - ఏకత్వమున
బేలానై పోతి - యెంతో విషయ
లోలుడ నైతి - నీమోహజా
లాళీ పాలబడితి - ఏలితివా
మూలము మూల ప్రకృతి
కీలెఱింగితె నేను - నాలయమైతె నీవు
లీలలలోన రావు
లేకుంటివో - దాగుంటివో
కడనుంటివో - సుద్దులులేక ॥తెలుసు॥ 3

జాలి పడవేలా జన్మాదులు జరుపూట
వీలా నిను గాలించి గనుగొనుట
మేలా వలపధికమై
తాళాగా జాల - శరణంటిని ఎఱుకవునీవు
చాల మరులను బడితేల
జాలను నేలరాల - గొట్టకు వట్టి
కాల హతినమ్మితి - తల వంచితి గురి నుంచితి
చొఱువునగాని ॥తెలుసు॥ 4

జీవమె నీవు గావ - స్థిరమైతే భావము తెలుప
లేవ కల్పనచే దేవుఁడ వీవ
కేవ లద్భుతం
బీవట మసలెదవ - శివుఁడంటె ఔనని పల్కి
నావు హరివయి నిల్చినావు - ముప్విధమూన
నీవు అవతరించి

నావు - అఖైలలీ అఖమల్ అలీ
మొహిద్దీన్ బాషాయనుతునింక ॥తెలుసు 5

కం. నాదము నాదము నందున
ఖేదముగా మాయమాయ - బిందున బిందున్
సాధనము నెఱిఁగి నిలుపుము
ఖేదము లేకుండ నాత్మ - కృతకృత్యుఁడవై.

మధ్యమావతిరాగము - ఆటతాళము

వినరయ్యా వినరయ్యా - వినరయ్య సఖులార
విన్నవించెద తత్వ విజ్ఞానము ॥విన॥ 1

తారకమెఱుఁగని - తపసు తామసమౌ నోం
కారమాత్మ తరచా తరమౌనటరా ॥విన॥ 2

తనయాత్మ తన్మయమై - చిన్మయానందము
తనుగన్ననమనస్క - మదియేనురా ॥విన॥ 3

సత్యమందాసక్తి - స్వస్వరూపపువ్యక్తి
వ్యత్యాసా మనిపీడ - నాఁడకురా ॥విన॥ 4

శాంత మత్యంత ది - గంత కీర్తి తేదా
శాంతిమతిని గనుటె - సారూప్యము ॥విన॥ 5

శిష్టచిత్తమై జ్ఞాన - సిద్ధి చిన్మయ శక్తి
దుష్టా పేక్షల కిఁక తా - వెందుండురా ॥విన॥ 6

ఎన్నెన్నో విధముల - వెదకితి నీ తెరవు
నన్ను నేగనుట - గనరాదాయెగా ॥విన॥ 7

త్రిగుణాన్వితాత్మ త - త్వము మలినామై సల్పు
త్రిగుణ రహితాత్మ శు - ద్ధ తత్వమురా ॥విన॥ 8

సహజా మనస్క మా - ఖైలాలి గురుసేవ
మొహియదీన్ఖాషా - సా ధించేనురా ॥విన॥ 9

క. మూలకమలమునఁ బుట్టియు
ఫాలమునన్ జేరి లోక । పాలెము దిరుగున్
లీలను నాదము హంసగ
పాలము బద్దలగుటిదియె । పలికిరి బుధులున్.

సావేరిరాగము – ఆటతాళము

సన్నుతించెదను నాగురుని నన్ను
మన్ననతో బ్రోవు మనుచు వేఁడితిని ॥సన్ను॥ 1

కన్నీడ సేయవద్దంటి నన్నా
పన్నాని దయఁజూడు – పన్నాగభరణా
పన్నగ పాపహరణ – ఉన్నతదీన శరణా
ఖిన్నాని నన్నేలు కరుణ – ॥సన్ను॥ 2

నిన్ను నమ్మితి భ్రమ బాసితిని నన్ను
నిన్నాని దెలిసి నియమమ్ముచె గొలిచి
కన్నుల నడుమా నిలిచి
తెన్నిదియాని తెలిసి
నిన్నాశ్రయించితి వలసి గాన
విన్నాణమౌ మతిని గలిగి తలవంచి ॥సన్ను॥ 3

పొందితి రాజయోగంబు నందు
జెందిన సాంఖ్య తారక యమనస్కంబు
లందిన యా యోగంబు
నందలి యనురాగంబు
చందంబు నేనై కరంబు
బిందు నాదంబు కళజీవి నై యోంకారంబు ॥సన్ను॥ 4

అయమాత్మ బ్రహ్మమందురు దాని
మయ మాహమస్మి బ్రహ్మమనియు బల్కుదురూ
త్రయభక్తు లెఱుఁగరూ
త్రయ జ్ఞాన మెఱుఁగారు
త్రయగుణ్య రహితమెఱుఁగారు ప్రజ ని
ష్త్రయ గుణ్యపధవిచరితా మనుచు నేరు ॥నన్ను॥ 5

ఏక పత్రికాళ సర్వేశా సకల
లోక పహకార గురువా ఖైలలీషా
చేకొని మొహిదీన్ బాషా
సాకుమ ధరవిశేషా
స్తోకైక జ్ఞానమనీషా ఎల్ల
శోకంబు లడుపూము భక్తైకపోషా ॥నన్ను॥ 6

క. త్రిగుణములు మూఁడు మూర్తులు
సగుణగుణం బీశ్వరుండు • నాత్మమయంబై
భగవంతుఁడనఁగ బరఁగెను
సుగుణంబే సూత్రధారి • చూడుము వత్సా!

క. శుద్ధాత్మ విష్ణురూపము
శుద్ధాత్మయె హంసతేజ , సూక్ష్మాణువులున్
నిర్ధారణయగు శ్రుతులను
శ్రద్ధాత్మన్ నిల్పిచూడ • సద్గుణతిలకా

కమలంబు లాఱునొక్కటి
కమలాత్ముం డాత్మనుండు • కనులయుగమునన్
యమున సరస్వతి గంగలు
సమమై ఘ్రాణంబునుండు • శ్వాసకుదరిగన్.

## శ్రీరాగము - ఆదితాళము

నిను నమ్మి నానురా - నన్ను బ్రోవ రాదా స్వామి
నిను నమ్మినానురా - వినుతదేవాది దేవా
దీనుఁడాను గావరా - ॥నిను॥ 1

రేచకపూరకముద్వయము
యోచనఁ జేయు నాదు
లోచన మయములో జ్యోతి
సూచనా నీ వేనురా ॥నిను॥ 2

కుంభక స్థానమునందు
గుంభనంబై యున్న త్వత్సౌ
రంభ దీప్తి దీపించు చున్నది
సంభవం బెటుల నౌరా ॥నిను॥ 3

చారు ఇడా పింగళ సుషుమ్నా
దారులను నేనేగిచూడ
తారకము శోభిల్లుచున్నది
ఆరహస్యము జెప్పి పోరా ॥నిను॥ 4

అలవిగాని నీనా మస్మరణ
తెలిసి నే భజియింప నేరా
లలితతత్వ మసి విచారము
దలఁప నేదో తెలిపి పోరా ॥నిను॥ 5

ఎంతవేఁడి నానుగాని
సుంతైన దయఁ జూడవేరా
అంతమతియే పొంతఁ బోవునా
చింతఁజేసి నిలుపవేరా ॥నిను॥ 6

పరమ శ్రీ యాఖై లలీ షా
గురుఁడు మొహియద్దీన్ బాష్య నేలు
తెలుగునను నా మఱుఁగువిప్పి
తెలవుజూపు కృపను గనరా

క. రూపంబును నామంబును
నేపునఁ జిత్కళలతోడ • నేకంబై కన్
బాపల స్థూలము సూక్ష్మము
జూపడ నాఖైలలీ వి శుద్ధుఁడు దెలిపెన్

క. నిగమము నాదబ్రహ్మం
బగు మనమే శుద్ధసత్వమై యున్నయెడన్
సుగుణ వచస్సులు సుస్వర
మగు రాగమె నారదుండు నగు నిక్కముగన్

క. రాజస తామస మణచియు
పూజితగతి భవము బాసి • పుణ్యాత్ముఁడవై
రాజిల్లవలయు లేనిచో
భ్రాజిత ప్రభువైననేమి • ఫలము లభించున్

క. ఇది సత్యం బిది సత్యము
మదినెప్పు డసత్యపథము • మానుము తుద క
య్యదియే నీవౌదని శ్రుతి
మొద లెఱిఁగించెను ప్రబోధ • మున గనుమనఘా

సావేరిరాగము - అటతాళము

ఏతపంబు చేయఁజాలను నే చేయఁజాలను
నాతరము గాదు మహిత శాస్త్రములను జదువను

ఏతపంబు చేయఁజాల
పాతకములఁ బడయఁ బోల
ఖ్యాతికొఱకు ప్రాక నయయో
నీలి యొకపె నమ్మియుంటి ॥ఏ॥ 1

యోగ సాధనముల నేరనూ
సాధనము నేరనూ వేదాంత మందు
యాగ భోగ త్యాగ మెఱుఁగనూ
ఆగమైక ఖేచరి భూచరి
నాగమధ్య షణ్ముఖి శాంభవి
నాగముద్రలైదు పట్టి
యూగి యూగి యలవనైతి ॥ఏ॥ 2

నాదు బింధు కళల మధ్యము బిందు
కళల మధ్యము మూఁడక్షరములా
మోదమొంద నిమిడె ప్రణవము
వేదహృదయ మెఱిఁగితేని
వాదరహిత ప్రణవపదము
నాదమగుచు మ్రోయునని నే
నాదరించి వినఁగ నైతి ॥ఏ॥ 3

తారకమును తఱచనైతిని నే తఱచ నైతిని
ఆ పరమ తత్వ
సారమేదో తెలియ నైతిని
ఊరకే వృథా పదాల
మేఱగాన లేక సతము
ఘోర విషయ వార్థిమునిఁగి
దాటెఱుంగలేక చెడితి ॥ఏ॥

అఖిలలోక ముల కధీశుఁడు ఆ లోక ముల కధీశుఁడు
ఆఖైలలీ గురుఁ
డఖిల క్షేత్రములకు నాథుఁడు
సుఖము దుఃఖ జగంబు నకు వి
ముఖుఁడు మొహియదీన్ బాషా
సఖులతోడను కలసి మెలసి
అఖిల రూపును గంటిగాని ॥ఏత॥ 5

క. అహమస్మి బ్రహ్మమను మీ
మహిమంత్రము లెన్నియైన ◆ మదినెంచకుమీ
మహనీయు లీ రహస్యము
సహజసమాధిని వచించి ◆ చనిరి యధేచ్ఛన్

క. ఏ రెమునా నది జేరెడు
దారిని గాచినది మాయ ◆ దాటఁటకై బల్
ధీరత ద్యుతి వశమగు గం
భీరత యోగ్యతసమాధి ◆ వృత్తులు వలయున్

ముఖారిరాగం - అటతాళము

తపసు లేల జేసెదరు తత్వమును తఱచి చూడరే
అపరమగు తా బ్రహ్మమేనని
యెపుడు తత్వం పదము లెఱుఁగక ॥తప॥ 1

అహ మనెడు రెం డక్షరంబులు
ఇహపరాల కా కరములై
సహజముగ నహమస్మి బ్రహ్మము
మహిత ధర్మము లరయ లేక ॥తప॥ 2

ఇచ్ఛతో తత్వమసి వాక్యము
ఉచ్చరించుచు ననిశము
అచ్ఛమగు లక్ష్యార్థసంపద
స్వచ్ఛ పదమున ముక్తి బడయక ॥తప॥ 3

ఈ రహస్య మెఱుంగఁ జాలక
మేరు ధీరులు నయ్యయో
ఏరి మా కిఁక దారి జూపే
వార లెవ్వారనుచు వేఁడిరి ॥తప॥ 4

మహిత శ్రీయాఖైలలీ గురు
డహ రహంబు ప్రసన్నుఁడై
మొహియదీన్ బాషా కొసంగిన
సహజ జ్ఞానపదంబు; తెలియక ॥తప॥ 5

శ్రీరాగము - ఆటతాళము

విననేర రిదిగానరు తత్వం అసి
యననేమొ గమనించరు
విననేర రిదిగాన రనయ మింద్రియజాల
మున భ్రాంతులై విషయా
ర్జన మత బధిరులై ॥విన॥ 1

త్రియరామము లెఱుఁగరు తారకమధ్య
త్రయ రూపములఁ జూడరు
త్రియశక్తులకు సుతుఁడు
త్రయలోక జనకూడు
త్రయగుణా్యా తీతుఁడు
త్రిపుటి నంటని యాత్మ ॥విన॥ 2

తద్రామ మ సి రామము త్వంపద రామ
మిది బ్రహ్మ వాక్యార్థము
సద్రూప మున జగము
చిద్రూప మున పరము
తద్రూప మేకమై
భద్రాత్మ యగు జ్యోతి ॥విన॥ 3

ఎందాక బతిమాలుదు ప్రేమతో భక్తి
చందా మేమని దెల్పుదు
అందమైన బ్రహ్మా
నందము న్మనియాము
పొందవచ్చును పూలు
క్రిం దేమ కొనురీతి ॥విన॥ 4

మది యీశ్వరస్థానము బ్రహ్మైమ వాహం
బదియా త్మకు రూపము
హృదయమందిది నిల్పి
అదె బ్రహ్మమని యెంచి
తుదకు మొహియదీన్ బాషా
పథగాములై దీని ॥విన॥ 5

క. భక్తికి మూలము నిజమగు
వ్యక్తియె వ్యక్తతను బొంది యవ్యక్తమునా
సక్తిన్ జెందక ధృఢమతి
వ్యక్తియె బ్రహ్మత్వమనుచు వీక్షించు మెదన్

క. యోగములు సాధనంబులు
యాగము లధికంబుజేసి యలసిన ఫలమే
రాగద్వేషము లణచక
భోగ పరాయణత మాని • పొందుము పరమున్

క. జాగ్రత్స్వప్న సుషుప్తుల
వ్యగ్రతగని సాక్షివగుచు • పరఁగుచు తన నా
సాగ్రమునందున దృష్టిని
నుగ్రత నిల్పెట సమాధి • యూహించు నెడన్.

మారుతరాగము – ఆటతాళము

విను మహాశ్చర్య మిదియు వినిపింతు నకటా
తనువులో బ్రహ్మమట తా గాంచు టహహా ॥విను॥ 1

జన్మమెత్తితి గాని జీవునకు సుఖమెఱుఁగ
సన్మాన మెవ్వరికి సేయ లేనైతిన్
తన్మయంబేదో యా తత్వమేదో తెలియ
దు న్మనియోగ మే లాగు సాధింతున్ ॥విను॥ 2

ధనధాన్యములు గూర్చి ధరగానకను తిరిగి
వినయ మేమియు లేక విఱ్ఱ వీగుచును
మనమునను తను గర్వ మును నొంది మండిపడి
తనకన్న ఘనులెవ్వ రనుచు నే చచ్చున్ ॥విను॥ 3

అయ్యయో యీకాయ మంధకారము నొదిగి
శయ్య సుమములపంది సౌఖ్యమొందుచును
వెయ్య మాయలు బన్ని కయ్యంబు లనుబెంచి
వయ్యలై తుదియముని ద్వారంబు జేరున్ ॥విను॥ 4

భాగ్యవంతుల మంచు భగవద్గృహంబుల
యోగ్యమని గట్టింతు రదియేమొ వారు
భాగ్యహీనుల బుధుల పట్టెడన్నంబిడ ర
యోగ్యులా పాషాణ ముల కిడెదరేమో ॥విను॥ 5

సోహమంతఃకరణ మందున్న దేయాత్మ
దేహియంచును శ్రుతుల శ్రుతపర్చికొనుము
మోహరహితపదాన మొహియదీన్‌బాషా సం
దేహములు ఆఖైలలీ గురుడు మాన్పె ॥విను॥ 6

ముఖారి రాగము – ఆదితాళము

ధరణి నరజన్మమేటికి దుర్లభ మయ్యయ్యో
పరమాశ్రమలోర్చు పెట్టులో
గురువా గురువా యని
మొరయుచును నే
నలుచుచును వలదంచు వేఁడితి ॥ధర॥ 1

గురువృక్షణభంగుఁడాయెను
అమనస్క మందు
తరణి తుదమోద లాయెను
అరసి జూచిన నాత్మ నేనట
విరుకు దెల్పగ
మొరలు బెట్టితి ॥ధర॥ 2

చెలిమి విలంబమాయెను అంత కంతాకు
తెలివి తేజమై నిలిచెను
వెలయు కన్నుల పాప వోయని
తలఁచి బిలిచిన పలుకవై తే ॥ధర॥ 3

వినుమీ తేజ స్వరూపము నాదామైయుండు
కనుమీ సుషుమ్నా భావము
మునుపునీది య నాదిరూపము
జననమే యీ భేదమాయెను ॥ధర॥ 4

ఇలపై కలకాలమున్నా నిలిచినా దేహి
ఫలమా నిను గాన కున్నా
తెలివిలోపల తెలివి నీవని
తెలిసి తెలిపై కలియకున్నా ॥ధర॥ 5

కలిమూక సంహరించి ఫాతిమ సుతుఁడు
కలికమై యవతరించి
తెలిపె మొహియదీన్ బాషా
కలవిగాని నివృత్తి మార్గము ॥ధర॥ 6

క. మాయ తేజ ద్వయమును
సోయగముగ నేక పరచి, చూడ సుషుమ్నా
తోయము చిన్మయ రూపము
కాయములో సూటిచూడ గలవు నిజముగన్

క. కమలములు మూల గుహ్యము
లమలత నాభియును పక్ష, మరయఁగ కంఠ
క్రమమును భ్రూమధ్యంబును
విమల సహస్రార మనఁగ, వెలయును గనుడీ

క. మేనున నింద్రియములు పది
మానుగ వాయువులు విషయ, పంచక మెదయున్
పూనియు నిరువదినాలుగు
వానిలో జీవుండు క్షేత్ర, వాసిగ నుండున్

సావేరిరాగం – ఆటతాళము

తమ్ముఁడా నీతగవుఁ దీర్చెదను
ఔరౌరా ఓ నా

తమ్ముఁడా నీతగవు దీర్చెదను
తమ్ముఁడా నీతగవు దీర్చెద
నిమ్ముగా నాశైల లీషుని
నమ్మి పద కంజ ద్వయం బది
సొమ్మనుచు జపియించుచును నే ॥తమ్ము॥ 1

వాఁడు వీఁడని వగచు చుండుదురు
కలియుటకు తగువు
వీడఁజెప్పే సాక్షి లేఁడనుచు
వాఁడె యగుణుం డీశ్వరుండన
వీఁడె సగుణుఁడు జీవుఁడేయన
కూడు గుణ నిర్గుణము తగువా
నాఁడు తీరెను తానె సాక్ష్యము ॥తమ్ము॥ 2

తాను నేననె తత్వ భేదమును
తరచితే తనలో
తాను నే నేకమై నిలుచును
మానుగా నవనీత ఘృతముల
గానఁ బడియెడు ద్వివిధ రుచిగతి
మేను నాత్మల కరయఁ గావలె
గాని తుదకవి యేకమౌగద ॥తమ్ము॥ 3

ఇట్టిదని యనరాని దోం పదము
ప్రణవ మది నిజము
ముట్టినది మూఁడేకమై గనుము
అట్టి నాదముతోను నరుఁడై
పుట్టి వేర్వేరుగ ప్రపంచము
మట్టు పఱచియు మాయ యనునొక
గుట్టుపెట్టి నటించుచున్నది ॥తమ్ము॥ 4

విన్నవించితి వినర నాయన్నా
ఆదరణ తోడుత
నిన్ను తలచితె లేదు నీకన్న
పన్నుగా తరచుటయె తగువది
మున్ను తగు పెద్దలు వచించిరి
సన్నుతించగ ప్రకృతి జీవుల
కున్నదిక రవ్వ పడనేల ॥తమ్మ॥ 5

వచ్చి పోయెడి జీవు డీశ్వరుడు
కుంభకము నెఱిగితె
స్వచ్ఛమై కన్పడును నీశ్వరుడు
ముచ్చటగు రేచకము పూరక
మిచ్చతో నడిపించు వారికి
వచ్చు చీకటి వెలుగు నెదలో
వచ్చు సర్వము విశదమౌను ॥తమ్మ॥ 6

ఇచ్ఛ మాత్రుం డాత్మ తాననుచు
ఆగామి సంచిత
తుచ్ఛ ప్రారబ్ధములు గాననుచు
ఉచ్చరించుచు తాను వాడై
స్వేచ్ఛగా గనువాడు తానై
అచ్ఛమగు బ్రహ్మ స్వరూపము
దెచ్చుకొనె మోహియదీన్ బాషా ॥తమ్మ॥ 7

క. విను జ్ఞానేంద్రియ ములు నై
దును కర్మేంద్రియము లయిదు , తోడ్పడదు గాని
తనువు రథాకృతి నీమే
దిని సంచారంబు సేయు , దినమున్ రేయున్

క. కరములు వాక్పాదంబులు
బరఁగంగా మూల గుహ్య • బహిరేంద్రియముల్
వరుసగ త్వక్చక్షులు ఘ్రా
స్వర కర్ణఘ్రాణ జిహ్వ • జ్ఞానేంద్రియముల్

సావేరిరాగము - ఆటతాళము

శోధించినాను ఆత్మను నేను
శోధించి నాను
శోధించినాను నా ప్రజ్ఞాన బ్రహ్మను
సాధించితిని ప్రత్యగాత్మలోపలి జ్యోతి ॥శో॥ 1

పంచకోశముల కవ్వలనే రూపించు తత్వముల
గాంచి యాత్మకారా హంస స్వరూప మా
ర్జించి యమనస్క సామ్రాజ్య ప్రపంచము ॥శో॥ 2

కోలా హలముగనూ
సలిపితి శౌచ శీలాచారమునూ
స్థూల సూక్ష్మ కారణ స్థానముల కాది
మూలమైన పరబ్రహ్మ స్వరూపము ॥శో॥ 3

నాదానందమును ఆకర్ణింప
నాదుబిందులనూ
మోదముగా కళను జేర్చి వినుచుండఁగా
నాది యోంకార సమాధి ప్రత్యగాత్మ ॥శో॥ 4

నను జూడ జూడ మును స్నేహములు
మనమూన పీఠ

అనునాయా మాయా విద్యలజీవేశ్వరులైతి
తనువైతి మనమైతి ఘనసత్ పరమాత్మనై ॥శో॥ 5

సహకారాకరుఁడు అఖైలలీషా
మహి ప్రభాకరుఁడు
మొహియదీన్ బాషా సమ్మోదమలరఁగఁగాచి
ఇహపరపదపూల నిచ్చెను ఆమరుగు ॥శో॥ 6

క. వ్యాన ప్రాణ సమాన య
పానోదానంబు లైదు ‚ వాయువు లందున్
గానఁగ నయ్యెడు జీవుఁడె
నేనని వచియించు శుద్ధ ‚ నిర్గుణవృత్తిన్

క. కామ మను పశువుగొని హృద్
హోమమునన్ గాల్చకున్న ‚ నుత్తవి మఖముల్
నీమములు మిగులఁ జేసిన
కామము రహితంబుఁగాదు ‚ కఠినాత్మలకున్

క. ఎవ్వని నిరసించుచు నెద
నొవ్వంగా నుడువ వలదు ‚ నూర్కొని నరులం
దెవ్వియొ సుగుణము లుండును
దివ్వెకు వెలుగుండురీతి ‚ తెలియఁగ వశమే

శ్రీరాగము - ఆదితాళము

యోగముద్రి విడుమీ నీలో
దాగిన హరిగనుమీ
బాగుగ శ్రీయాఖైల లిషాగురుఁ
డా గతి దెలుపు సుమీ ॥యో॥ 1

సత్తు చిత్తు ద్వయము చిన్మయ
చిత్త మీవు గనుము
అత్తిరి చిణి చిణి ఘంటారవములు
ఉత్తవౌను వినుము ॥యో॥ 2

చూడ చిత్రమైన మహిమా
జాడను దెల్పెద నా
ఈడా పింగళ నడుము సుషుమ్నా
నాడియె తాననుమా ॥యో॥ 3

నాదు బిందు కళలా నెమ్మది
పొదుకొనిన యవలా
నాదము నాలింపుము భ్రూత్రికుటి
వాద మణచి యచట ॥యో॥ 4

ఆనందము నెదగనుమా తా నహ
మస్మి బ్రహ్మమనుమా
ఆనందో బ్రహ్మే తివ్య జానాల్
అను శ్రుతి మఱువకుమా ॥యో॥ 5

త్వంపద లక్ష్యమును అఖి
లలి గురు బ్రహ్మమును
సొంపుగ మొహియదీన్ బాష్యా గని
సోహమందు వినెను ॥యో॥ 6

క. పాపము గానక మాయా
కూపమునన్ బడి వివేక • శుద్య మెఱుఁగకన్
దీవుల రుచి మఱఁగియు కను
చూపే చరితార్థమంద్రుడు • క్షుద్రులు భ్రాంతిన్

సాధన చతుష్టయము నా
మోదముగా నభ్యసించి • బోధాత్ముఁడవై
వేదాంత విధుల నేర్చి స
మాధిని గ్రహియించి సిద్ధి • బడయుము పేట్కాన్

తత్వ మసీ యని సన్నం
గత్వంబునఁ దెలిసి బుధులు • గాంచిరి నిరో్మ
హోత్వంబగు నపవర్గము
తత్వజ్ఞులు తరచినట్టి • తాత్పర్యమునన్

పీల్వారాగము - ఆటతాళము

ఓం కారమే జీవమనుచు నమ్మి
నా కారమునను వీక్షించు
ఏకమౌను నీలో ఆకారమును బొంది
ఆకంటి నడుమ నీ
వఖిలామై నిలిచెదవు ॥ఓం॥ 1

ఓంకారమునకు నాదామునకు భేద
మున్నా దేమిటొ తెలియ వలయు
ఓంకార మిహమగును నాదాము నీవగును
శంకలెంచక తనుతాసాధించిజూచితె ॥ఓం॥ 2

తొలిజన్మ పదము లన్నిటిని తలఁచి
తలఁచి నే జాలి నొందితిని
ఇలకొన్ని జన్మములు ఈజన్మ మున జరిపి
తెలివిలోపల తెలిపై తే జాము కనుగొంటి ॥ఓం॥ 3

ఆది యనాది మర్మంబు తెలివి
సాధించి గనుట ధర్మంబు

బిందు బీజము నందు నీవై నిలిచి నాద
మందు లగ్నంబై యా నందాము నొందెదవు ॥ఓం॥ 4

నేనై నను జూచు చుంటీని ఆఖై
లలి గురు నచట గంటీని
జ్ఞానసమాధి మొహియదీన్ బాషా్య సం
ధాన ధ్యాన మిదియె తర్కించి చూచితె ॥ఓం॥ 5

సావేరిరాగము - ఆటతాళము

గురునిఁ గోరవలెరా తత్వము
మఱుగును గనవలెరా
గురునిఁ గోరవలె మరుగును గనుటకు
దురిత భవంబుల దురిమి మనంబున ॥గురు॥ 1

చారుతరంబైన ఆత్మా
కారా కారమున
తారక సాంఖ్యము తరచి తరచి మది
సారె సారె కమ నస్కపదంబున ॥గురు॥ 2

నరజన్మంబెత్తి హరిని
నరయలేని తీత్తి
పురుగు సుమీ భారత యితి హాసము
లెఱింగి వచియించిన నేమి ఫలంబగు ॥గురు॥ 3

ఆరు గుణము లణచి ప్రకృతిని
వేరుజేసి నిలిచి
తారక మందున తత్వము గనుగొని
నేరిచి యెఱుకలో యెఱుకను నిల్పియు ॥గురు॥ 4

తరముగాని తత్వం పదముల
వరయ మిట్లు సత్యం
బెఱిఁగిన వారికి నరకము లేదిక
పర బ్రహ్మమగు ప్రత్య గాత్ముఁడగు ॥గురు॥ 5

మహి యాఖ్యైల లిషా కరుణకు
మొహిదీయను బాష్యా
శిరిమిడి వెరువక స్థిరమై పరమై
పరం జ్యోతియై పరఁగిన విధమిది ॥గురు॥ 6

మారుతిరాగము - ఆదితాళము

నిన్ను నమ్మితి బ్రోవ రాదా నను బ్రోవరాదా
    ఔర నాసామి జగదధిష్ఠాన

సన్నుతించెద నౌరా
మన్ననతో మన సా రామమంద నిశాము
నున్న సుమ శత సుప్రకాశ సౌరభకార ॥నిన్ను॥ 1

చేసిన నేరము లేమి వాసిగ నీకు
దోసిలొగ్గితి చూడ వదేమి
దాసూడ గద కరుణ దలఁచి రక్షింపూము
భాస మాన జ్ఞాన భావ పూరిత మతిని ॥నిన్ను॥ 2

ఇడుము లొసఁగుట న్యా యమ్మా కఠిన హృదయ
విడుము విడుమిది ప్రౌఢతనమా
వడిగట్టితివి నా పా పములా లాభమ మేటి
కడగండ్లఁ దప్పించి కడు సూఖ మిడుమింక ॥నిన్ను॥ 3

కొంచ మలసినది నా తనువు కనికర హృదయా
మంచి మంచిదిర మన వినవు
కించలేదు పంచ సంచలం దుండీన
వంచన సేయకు వరము లొసఁగుధీర ॥నిన్ను॥ 4

సాక్షీ స్వరూపము నందె స్థూలము నిల్ప
సూక్ష్మకారణము లయమొందె
దీక్షచేఁ జూడ బ్రహ్మత్వమీదియె నిన్ను
వీక్షించె మొహియదీన్ బాషా ఆఖై లలిషా ॥నిన్ను॥ 5

జంఝూటిరాగము - ఏకతాళము

శ్రీగురు ఓం, శ్రీగురు ఓం, సత్యము చిత్కళానిధీ ॥శ్రీ॥
ధరణి చరాచర స్థూల సూక్ష్మ బం
ధుర శరీర శ్రీ॥ శ్రీ॥

అక్షయుఁ డవ్యయుఁ డక్షరుండు బహు
నిక్షేపుఁడవు ॥శ్రీ॥
శిక్షమాని రక్షణఁ జే యుటకు
దీక్ష వహింపుము ॥శ్రీ॥ 2

లక్ష్యభావ మీక్షించి నప్పుడు
సూక్ష్మ కరుండవు ॥శ్రీ॥
వక్ష్యమాన స్తోత్రములు జేసిన నొక
యక్షరము దొరకదు ॥శ్రీ॥ 3

ఈక్షితి దయ నీక్షణ జేసి సు
భిక్ష మొసంగిన ॥శ్రీ॥
పక్షపాత మే టికి రక్షకుఁడవు
దాక్షిణ్య నిధీ ॥శ్రీ॥ 4

యక్ష కిన్నరులు నుతించిరి యే
కాక్షరి నీ వని ॥శ్రీ॥
కక్ష కలిగి కలిని సంహరించిన
సాక్షాత్కాలికము ॥శ్రీ॥ 5

త్రియవస్థల త్రిగుణంబుల
త్రియ మూర్తుల కతీతుఁడవు ॥శ్రీ॥
త్రియీ స్వరూపుఁడ త్రికూట నిలయుఁడ
త్రయంబ నుతుఁడవు ॥శ్రీ॥ 6

చిదా నందుఁడవు బుధానుమతుఁడవు
సదా శివుండవు ॥శ్రీ॥
ముదావహుండవు శ్రుతీ ప్రసిద్ధుఁడవు
హృదంత రాళుడవు ॥శ్రీ॥ 7

నవలేశములై యవని నవతరించిన
రవి తేజుఁడవు ॥శ్రీ॥
నవ బ్రహ్మ నవ సంస్కార నదీ
నవీనాధిపతీ ॥శ్రీ॥ 8

శరణు శరణు శ్రీ యాఖైలలీ గురు
చరణాబ్జములకు ॥శ్రీ॥
మఱయుచు వేడెదు మొహియదీన్ బాష్యా
వరద భజించెద ॥శ్రీ॥ 9

### ముఖారిరాగము - ఆదితాళము

జోహారు గురుని చరణంబులకు
నా చేతులార చేసిన పాపంబులు
నీహార లేశమై రహితంబౌ ॥జో॥

మోహ కామముల మురయక మనమున
దేహి ననుచు సద సద్వివేకముతొ ॥జో॥ 1

సహకారం బొసఁగు సాకారాత్మన్
సంశయ రహితంబై సహజా మ నస్కమగు సకలంబున్
ఇహపర పేక్షల మతి బరిమార్చిన
అహమస్మి బ్రహ్మంబు నిజంబని ॥జో॥ 2

ఆధారంబైన ప్రాణవార్థమును నేజెప్పెద నది మూ
లాధార కమలమున బుట్టును
మోదముగా సహ స్రారము జేరియు
నాదమగును నది నేనని తెలిసియు ॥జో॥ 3

ఓనా రెండింట నుద్భవ మాయెన్ పర అపరాప్రకృతులు
నీనా నేనదియు నిదియనఁ బరగెన్
మానితముగ నాత్మా నాత్మలు గని
తా నిజమై తన్మయమై యహమై ॥జో॥ 4

శ్రీ యోమాఖైలలీషా ప్రభువున్
నుతియించితె సకలము

శ్రేయస్సెస్సిద్ధియగు కోరికలున్
హేయ ఉపాదేయములు గ్రహించియు
సోయగముగ తత్వ మసి నేనని ॥జో॥

కన్నొలనడుమ తా చిన్మయుఁడై అఖైలలి గురుదెదలో
వెన్నెల బయల నాపో జ్యోతై
యున్న మహాతత్వార్థ మెఱిఁగియు
గన్న మొహియద్దీన్ బాష్యావలె ॥జో॥

## కమాచిరాగము - ఆదితాళము

నినునా గతియని నే ధ్యానించెద
నను రక్షించుము - నరనాథా ॥నిను॥

నిను నమ్మితి న మ్మితి బ్రోవుమునన్
గనుగొని విడువకు ప్రణవనాదా
మనమున ననిశము వినయముతో నతి
ఘనముగ వేడెద శ్రీనాథా ॥నిను॥ 1

సకలోప నిష త్సారము దెలిపియు
వికలతఁబాపు వి వేకముతో
అకలుషమగు ల క్ష్యార్థము బ్రహ్మం
బేక త్వంపద ప్రత్యగాత్మయని ॥నిను॥ 2

పంచకోశముల నెంచి మించి యెది
రించి యవస్థా త్రియసాక్షి
సంచిత ప్రారబ్ధముల కతీతమై
అంచిత యాత్మ ప్రకాశము ముందర ॥నిను॥ 3

ఆత్మాకారా కారిత్వముతన
స్వాత్మ ల యాంతక యోగమదే
ఆత్మా నాత్మ వి వేకం బిడ్చుట
నగుపడు నాహం బ్రహ్మం బనుచును ॥నిను॥ 4

ప్రజ్ఞానం బ్రహ్మం బని సత్యము
ఆజ్ఞాపించెను శ్రుతులం దా
ప్రాజ్ఞయందె సమ చైతన్యం బను
విజ్ఞానమె ని ర్వాణ పదంబని ॥నిను॥ 5

సోమ సూర్య వహ్ని మండలముల
నే మహనీయుఁడు వెలుఁగునో యతఁడే
భూమిని శ్రీ యా ఖైలలిషా గురుఁ
డా మొహియదీన్ బాషా ప్రభుఁడని ॥నిను॥ 6

జాలికాంభోజిరాగము - ఆదితాళము

మాయా జాలములోను మఱఁగై యున్నవాని
మహిమ దెలియనైతినే అమ్మయ్య 1

కన్నవా రిల్లాని మన్నానఁ జేసితి
ఎన్నాటి కరుగానుగా ॥అమ్మయ్య॥ 2

మాసములు పది రెండు మోసి గని పెంచినను
బాసి తత్త్వని తిడితీవి ॥అమ్మ॥ 3

బొమ్మ నిట్టాటలను బొమ్మ రిండ్లను బెట్టి
సొమ్ములనిడి చెప్పితి ॥అమ్మ॥ 4

ప్రకృతి సఖులను గూడి వికృతి జెందితి గాని
సుకృత మెఱుఁగ నైతినే ॥అమ్మ॥ 5

ప్రకృతి సఖులన శబ్ద స్పర్శాది పంచకమె
సుకృత మేనని యెఱుఁగూటే ॥అమ్మ॥ 6

అదినేను ఇదినీవు అని మోసబుచ్చిరి
అది యీది నేనైతిగా ॥అమ్మ॥ 7

సహజా మ నస్కాని
సహ చర్యమునఁ జూడ
ఇహము పరమైతోఁ చెనే ॥అమ్మ॥ 8

సత్య మిదియని తెలిసి
నిత్య ధ్యానము నిలిపి
ప్రత్యగాత్మయి యుంటినే ॥అమ్మ॥ 9

తానె తానను తత్వ
జ్ఞానాము తెలియకను
పూని నోముల నోచితి ॥అమ్మ॥ 10

మహి నాఖైలలి గురుఁడు
మొహియదీన్ బాషాను
మహిమ ప్రబోచుట వింటినే ॥అమ్మ॥ 11

రాగము - ఏకతాళము

భావమె జ్యోతి భవ భయ హరణము
జీవము రామము జానకి కాయము 1

దేశము దేశము తిరుగుట యేలా
దేశకుని కృపన్ దేహియె దైవము 2

ఈ సం సారము కోసముఘోరా
మోసము లేలా జేసునా కుజనుల్ ॥భావ॥ 3

తను గనవేమి మనసా ఘనమా
ఘనుఁ డను కొనినను చనవలె ఒక పరి ॥భావ॥ 4

వెరువక స్థిరమై పర బ్రహ్మమై
పరం జ్యోతియై పరంబు గనుమీ ॥భావ॥ 5

ధర నా ఖైలలి గురువరు నమ్మిన
వర మొహియ్యు దీన్ బాష్యా పద మిది ॥భావ॥ 6

## శ్రీయుత మాసాబత్తుల - పద్మనాభముగారి కీర్తన

### సావేరిరాగము - ఆటతాళము

గురుని దెలియని జన్మ మెందూకు
ఓ వెఱ్ఱి మనసా
గోప్య మెఱుఁగని జ్ఞాన మెందూకు
గురుని దెలియని జన్మ మెందుకు
గోప్య మెఱుఁగని జ్ఞాన మెందుకు
హరిని దెలియని యాత్మ యెందుకు
నిరసనంబై నిష్ఫలంబౌ ॥గురు॥ 1

ఎన్ని జన్మము లెత్తితేనేమి
గురువరుని పదములు
సన్నుతించని నరుని గతియేమి
అన్నవినుతన్మయుడవై తా
నున్న సకలము తానెతానై
కన్నులారా జూడకున్నను
ఎన్ని సాధనములను జేసిన ॥గురు॥ 2

తాను తానై నిలిచి వెలిగెదవు
తనలోని తత్వము
తరచి గన్నులగాంచి పలికెదవు
పూని సద్గురు పాద సేవను
మోహమున కడు జేయ నేర్చిన
జ్ఞాని మోక్షము బొందగలుగును
వానిదే జన్మంబు నిక్కము ॥గురు॥ 3

గురువరేణ్యుని కరుణతోడు తను
వీక్షించి యొసఁగిన
గూఢమంత్రమె ముక్తి నిచ్చును
హరిని గనియెడు దారి దొరకును
దురితములె కడు జేయుచుండిన
దొరకునే హరిమరుగు నరునకు ॥గురు॥ 4

నేను నేనని వాద మాడెదవు దేహంబు విడిచిన
నేను ఏమైపోవు తెరుగావు గాన శ్రీయాఖ్యైలలీ గురు
ధ్యానమందున నిలిచి జీవ
జ్ఞాన మెఱిఁగిన పద్మనాభు ని
ధాన మిదె వేరేమి యున్నది ॥గురు॥ 5

మాసాబత్తుల పద్మనాభముగారి జనకులు సుబ్బదాసుగారి

కీర్తనలలో నొకటి

జీవుఁడే నీ హృదయమున గురు
దేవుఁడై యున్నాఁడు రా
భావమే నీ యోగ జనితము
నీవు నినుగని చూడరా ॥జీవు॥ 1

తరచి శాస్త్రము లెల్లఁజదివిన
తనను దెలియక కల్ల రా
మరుగు దెలిసిన తాను నిజమై
మహిమ శాస్త్రము తానెరా ॥జీవు॥ 2

దేవభూములు గుహలు వెదకిన
దేవుఁ డొక్కఁడె చూడరా

కేవలము నీ మనసు ఒకపై
కినుక విడి గురుజేరరా ॥జీవు॥ 3

ముసిడికాయలో పురుగుచందము
పుడమి నాళలు వీడరా
అసి పదార్థము గురు పదాబ్జము
స్థిరముగా నది నిల్చురా ॥జీవు॥ 4

హరి నెఱుంగని జన్మ మెందుకు
నాత్మలో శోధించరా
హరియె గురుఁడె జగము లోపల
అలరుచుండెను చూడరా 5

మాటిగా నీ హృదయకోశము
మాటులోపలఁ జూడరా
కూటమై యున్నాఁడు సద్గురు
బాటగని విహరించరా ॥జీవు॥ 6

చూపు లోపల నేకరూపము
ప్రాపు గోరుచు నుండరా
ఆ పరబ్రహ్మ స్వరూపము
నైన తత్వము తానెరా ॥జీవు॥ 7

వరదుఁడై నా శైలలీగురు
చరణ సన్నిధిఁ జేరరా
పరమ నిలయుఁడు సుబ్బదాసుని
కరుణ నేలిన కర్తరా ॥జీవు॥ 8

